## తారాతీరం

# డూప్ లేకుండానే!



తమిళ పరిశ్రమలో దశాబ్ద కాలంపైగా స్టార్ హీరోయిన్‌గా కొనసాగిన త్రిష తాజాగా గ్లామర్ రోల్స్‌కు చెక్ పెట్టి కథా పరమైన హీరోయిన్ ఓరియెంటెడ్ పాత్రలనే చేస్తోంది.. ఆమె చేతిలో నాలుగైదు సినిమాలున్నాయి. వీటిలో 'గర్జనై' కూడ ఒకటి.. ఎన్హెచ్ 10కి తమిళ రీమేక్‌గా రూపొందుతున్న ఈ చిత్రంలో త్రిష ప్రధాన పాత్ర చేస్తోంది.. ఆమె పాత్ర చుట్టూనే సినిమా మొత్తం నడవనుందట. ఈ మూవీ కోసం త్రిష చాలానే కష్టపడుతోందట.. ఆమెపై నడిచే పోరాట సన్నివేశాలను డూప్ లేకుండా స్వయంగా తనే చేస్తోంది.. ముందుగా దర్శకుడు సుందర్‌బాలు ఆ రిస్కీ స్టంట్స్‌ను డూప్‌ను ఉపయోగించి చేద్దామన్నా త్రిష ఒప్పుకోలేదట.. పైగా ఎంతో అనుభవజ్ఞురాలిలా ప్రతి స్టంట్‌ను జాగ్రత్తగా చాలా పర్ఫెక్షన్‌తో చేస్తోందని, ఆ డెడికేషన్‌వల్లే ఇంకా స్టార్ హీరోయిన్‌గా కొనసాగుతోందని సుందర్‌బాలు అన్నారు..



# యాక్షన్ లుక్‌లో

నిత్యం గ్లామర్‌కే ప్రాధాన్యమున్న పాత్రల్లోనే నటిస్తూ మెప్పించిన శృతిహాసన్ ఇపుడు ఏకంగా యాక్షన్ లుక్‌లో దర్శనమివ్వబోతోంది. గ్లామర్‌తో ఆకట్టుకునే శృతి కత్తి పట్టుకుని యుద్ధం చేస్తుంటే ఎలా ఉంటుందో ఒక్కసారి ఊహించుకోండి. 'కాటమరాయుడు' తర్వాత తన తదుపరి చిత్రం సుందర్.సి దర్శకత్వంలో చేయనుంది.. తెలుగు, తమిళ, భాషల్లో ఆయన ఏక కాలంలో తెరకెక్కించనున్న 'సంఘమిత్ర' కోసం శృతి యాక్షన్ ట్రెనింగ్ తీసుకుంటోంది. కత్తి పట్టుకోవటం నుంచి గుర్రపుస్వారీ శిక్షణ తీసుకుంటోంది..

# బొద్దుభామల హొయలు

గ్లామర్ ఇండస్ట్రీ వయ్యారి భామలు, నాజూగ్గా ఉండాల్సిందే అనుకుంటాం.. ఇది గ్లామర్ ఫీల్డ్‌కి సంబంధించినంత వరకూ అలిఖిత రాజ్యాంగం.. అందుకే సన్నబడిపోవటాలు, జీరో సైజ్‌కోసం ఆరాటపడుతుంటారు మన భామలు. కానీ ఇపుడు బొద్దుగుమ్మల హడావుడి కూడ ఎక్కువగానే ఉందండోయ్..గతంలో తమిళనాట ఈ రకం భామలకు ఎక్కువ డిమాండ్ ఉండేది.. ఇపుడది టాలీవుడ్‌కి కూడ బాగానే పాకింది..పైపెచ్చు వీరికే అవకాశాలు కూడ తలుపు తడుతున్నాయి.. తాజాగా జరిగిన జీ సినిమాల అవార్డుల వేడుకలో ఈ విషయం తేటతెల్లమైంది.. కీర్తిసురేష్, అనుపమా పరమేశ్వరన్, సురభి వంటి భామలు ఒక ఉదాహరణే. కీర్తి బొద్దుగా ఉంటుందని ముందుగానే తెలిసినా.. క్రేజ్ బాగానే ఉంది.. ఇపుడు ఏకంగా పవన్‌కల్యాణ్ సినిమాలో కూడ నటించేస్తోంది.. మలయాళీ భామ అనుపమ ఆ వేడుకల్లో తళుక్కుమని ఆ డౌట్ తీర్చేసింది.







కె.సురేష్ బాబు

# హోమియో లైఫ్



డా॥ A.M. రెడ్డి
సీనియర్ వైద్యులు,
పాజిటివ్ హోమియోపతి
హైదరాబాద్, నిజామాబాద్
హన్మకొండ, కరీంనగర్, ఖమ్మం
Ph: 903-056-1144
767-200-2000

## హెపటైటిస్ బి-హోమియో చికిత్స



హెపటైటిస్ - బి అనేది కాలేయానికి సంబంధించిన వ్యాధి, హెపటైటిస్-బి వైరస్ ద్వారా ఈ వ్యాధి వ్యాపిస్తుంది, ఈ వ్యాధి ఆసియా మరియు ఆఫ్రికా ఖండాలలో చాలా చోట్ల ప్రబలంగా ఉంది, మొత్తం జనాభాలో వీరు 3-5 శాతం వరకూ ఉన్నట్లు అంచనాలు చెబుతున్నాయి, కాలేయానికి వాపు రావటం, వాంతులు, పచ్చకామెర్లు ఈ వ్యాధి లక్షణాలు, ఈ వ్యాధి ముదిరితే కాలేయం గట్టిబడిపోయి లివర్ కాన్సర్‌కు దారి తీసే ప్రమాదం ఉంది.

**వ్యాధి వ్యాప్తి:** ఒకసారి హెపటైటిస్ - బి వైరస్ ఒంట్లో ప్రవేశించిన తర్వాత ఒంట్లో వైరస్ సంఖ్య విపరీతంగా పెరుగుతూ కాలేయాన్ని దెబ్బతీస్తుంది, ఈ వైరస్ వ్యక్తి శరీరంలోని అన్ని స్రావాలలో అనగా రక్తంలోని, వీర్యం, లాలాజలంలోనూ ఉంటాయి. శారీరక కలయిక, రక్తమార్పిడి, సూదులు, సిరంజిలు మరియు తల్లి నుండి బిడ్డకు సంక్రమించవచ్చు.







**హోమియో వైద్యం :** పాజిటివ్ హోమియోపతిలో హెపటైటిస్-బికి అద్భుతమైన వైద్యం అందుబాటులో ఉంది. క్రానిక్ హెపటైటిస్ తో బాధపడేవాళ్లకు మందుల వాడకంలో రోగ నిరోధక శక్తిని పెంపొందించవచ్చు బ్రైయోనియా, లైకోపోడియం , వక్స్‌వామికా, చెలిడోనియం తదితర మందులను రోగి మానసిక, శారీరక వ్యాధికారక స్థితిని మరియు వ్యాధి లక్షణాలను పరిగణలోనికి తీసుకొని కాన్‌స్టిట్యూషన్ పద్ధతిలో వైద్యుల సూచన మేరకు హోమియో మందుల వాడటం వల్ల క్రానిక్ హెపటైటిస్‌ను అదుపులో ఉంచుకోవచ్చు, అక్యూట్ హెపటైటిస్ ను శాశ్వతంగా, ఎలాంటి దుష్పరిణామాలు లేకుండా, సురక్షితంగా తగ్గించడం జరుగుతుంది



## హెర్పిస్ కు అద్భుతమైన హోమియో చికిత్స



హెర్పిస్ సింప్లెక్స్, ఇది వైరస్ క్రిముల ద్వారా సంక్రమించే వ్యాధి. అంటువ్యాధి. పూర్తిగా నయం చెయ్యటం కష్టమే, వస్తూ పోతూవుంటుంది. దీనికి హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ 1మరియు హెర్పిస్ వైరస్-2 కారణాలుగా గుర్తించారు, అత్యధిక కేసులు హెర్పిస్ వైరస్-2 కారణాంగా సంక్రమిస్తున్నట్లు నిర్ధారించడం జరిగింది, అయినా ఈ రెండు రకాల వైరస్ మూలంగా నోరు, జననేంద్రియాలను హెర్పిస్ వ్యాధి సంక్రమిస్తున్నట్లు నిర్ధారించారు.

చర్మానికి చర్మం తాకినందువల్ల ఈ వ్యాధి సంక్రమిస్తుంది, చర్మం మీద ఎక్కడా గుల్లలు కనిపించని కేసుల ద్వారా కూడా ఇన్ఫెక్షన్ సంక్రమిస్తున్నట్లు గుర్తించారు, స్త్రీలలో యోని నుండి వెలువడే స్రావాలలో (పైన గుల్లలు లేనప్పటికి) వైరస్ క్రిములున్నట్లు కనుగోనడం జరిగింది. ఈ హెర్పిస్ సింప్లెక్స్ తీవ్రమైన అంటువ్యాధి, ఈ వ్యాధి సోకిన స్త్రీలు గర్భవతులైతే వైద్యుని తప్పనిసరిగా సంప్రదించాల్సి ఉంటుంది. కాన్పు సమయంలో ఈ వ్యాధి-పుట్టే బిడ్డకు సంక్రమించే అవకాముంది ఈ వైరస్ సోకి పుట్టపోయే బిడ్డలకు కంటిచూపు పోయే ప్రమాదముంది. మెదడు వాపు లాంటి వ్యాధులు సంక్రమించి శిశువు ప్రాణాలకు ప్రమాదం రావచ్చు.

హెర్పిస్ వైరస్ మెదడులోని నాడీ కణాలలో దాగి వుండి దేహరక్షణ వ్యవస్థకు తెలియకుండా నిద్రాణంగా ఉండిపోవచ్చు, మధ్యమధ్యలో ఈ క్రిములు విజృభించి జననేంద్రియాల వల్ల గుల్లలకు కారణమవుతుండోచ్చు, రోగనిరోధక వ్యవస్థ ఒత్తిళ్ళుకు గురైన సందర్భంలో ఇలా జరిగే అవకాశాలు ఎక్కువ, అలానే వ్యాధి మూలకంగా రోగనిరోధక వ్యవస్థ బలహీనపడిన సందర్భంలోనూ వైరస్ క్రిములు విజృంభించొచ్చు. హెర్పిస్ వైరస్ వలన రెండు ఇతరత్రా ప్రమాదకర వ్యాధులు సంప్రాప్తించే అవకాశం ఉంది, ఇది ఉంటే ఎయిడ్స్‌కారక హెచ్ఐవి తేలికగా సోకే అవకాశం ఉంది, మరొకటి హ్యూమన్ పాపిలోమా వైరస్, దీనివల్ల క్యాన్సర్ వచ్చే అవకాశం ఉంటుంది.

రోగి మానసిక, శారీరక వ్యాధికారక స్థితిని మరియు వ్యాధి లక్షణాలను పరిగణలోనికి తీసుకొని కాన్‌స్టిట్యూషన్ పద్ధతిలో వైద్యుల సూచన మేరకు హోమియో మందుల వాడటం వల్ల తగ్గించడం జరుగుతుంది




16 ఏప్రిల్ 2017




## విషయ విశేషం


'సంఘీ'భావం
సంతోష భారత్ ఎప్పుడో!.. 5
మూడో కన్ను
చైనా మారదా!....6
కవర్‌స్టోరీ
పుట్టకుండానే మరణశిక్ష!
విష సంస్కృతి..విషమ పరిస్థితి..8
స్ఫూర్తినిచ్చే జీ'వన'యానం!...12
ప్రేమ కథామాలిక
బండకాదది..ప్రేమగుండె..14
ధనం కన్నా జ్ఞానం కీలకం!....18
కథ
చేజారిన బహుమతి ....20
ఈవారం కవిత్వం
బొమ్మ-బొరుసు...23




చిత్రభారతి
ప్రతిభకు పట్టాభిషేకం..ఎన్‌టిఆర్ పురస్కారం....30

ఇంకా..కృతి, మొగ్గ, నవ్వుల్..రువ్వుల్, వాస్తు వార్త, పదమథనం ..వారఫలం.. వగైరా... వగైరా.





### అలరించిన కవర్ కథనం

ఏప్రిల్ 2 వార్త ఆదివారం అనుబంధంలో అందించిన కవర్ స్టోరీ 'ఉచ్చల జలధితరంగ.. 'అల'రించి సేదతీర్చే బీచ్‌లు' ఎంతగానో అలరించింది. దేశం లోని అనేకానేక బీచ్‌ల గురించిన విశేషాలు బాగున్నాయి. సముద్ర తీర వాతావరణాన్ని మా కళ్ల ముందు నిలిపిన మీకు అభినందనలు.

-కె.సుమిత్ర, హైదరాబాద్; వి.శ్రీరామ్, నల్గొండ.

### ఆకట్టుకున్న అంశాలు..

ఏప్రిల్ 2 వార్త ఆదివారం అనుబంధంలో 'భావవీచిక'లో ఘటన చదివాం. తప్పంటే తగులబెట్టే మనుషులుండటం నిజంగా చాలా ముప్పు. 'సంఘీ'భావంలో రైతు శోకం, దేశానికి శాపమని చక్కగా వివరించారు. కవర్ స్టోరీ..ఫొటోలు మనస్సును ఆకట్టుకున్నాయి. నాథ్ కార్టూన్లు నవ్వించాయి. మానవత్వమే మహోన్నతమని గోపాలరావు బాగా విశదీకరించారు.

-డా.శివభూషణం, కర్నూలు.

### ఆసాంతం ఆసక్తిదాయకం..

ఏప్రిల్ 2 వార్త ఆదివారం అనుబంధంలో కవర్ స్టోరీ మా మనసుల్ని పరవశింపజేసింది. 'అమ్మనాకు కావాలి' బాలగీతం స్ఫూర్తిదాయకంగా ఉంది. రామాయణం ఎందుకు చదవాలి? ఆర్టికల్ భక్తిభావంతో రంజింపజేసింది. 'ఓ పువ్వు పూసింది' కథ బాగుంది. భావవీచిక చదివి గ్రామపెద్దలే నేరానికి పాల్పడటం తెలుసుకొని బాధపడ్డాం.

-పక్కి రాధాగోపాలకృష్ణ, విశాఖపట్నం.

### ఆలోచింపజేసింది...

ఏప్రిల్ 2 వార్త ఆదివారం అనుబంధంలో 'సంఘీ'భావంలో రైతు శోకం. రాజ్యానికి శాపమని చక్కగా విశదీకరించారు. అసలు మన ప్రభుత్వాలకి రైతన్నంటే ఎందుకింత చిన్నచూపో ఎప్పటికీ అర్థంకాదు.'మూడోకన్ను'లో పేర్కొన్నట్లు 2019 ఎన్నికలదాకా బాహుబలి ఎవరో తేలదంటూ కాంగ్రెస్‌పార్టీ గురించి చక్కగా విశ్లేషించారు. కవర్‌స్టోరీలో బీచ్‌ల వివరాలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి.

-అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, కూకట్‌పల్లి.

### ఆర్టికల్స్ బాగున్నాయి..

ఏప్రిల్ 2 వార్త ఆదివారం అనుబంధంలో కవర్‌స్టోరీలో బీచ్‌ల వివరాలు కళ్లకు కట్టారు. 'ఓ పువ్వు పూసింది' కథాకర్త టి.లలితా ప్రసాద్‌కు అభినందనలు.'ప్రేయసీ ప్రియులమే' కవితలో కవి నిజమైన ప్రేమను అభివ్యక్తీకరించిన తీరు బాగుంది. సంఘీభావంలో చెప్పినట్లు రైతు శోకం, రాజ్యానికి శాపమన్న మాట నగ్నసత్యం. 'సీక్వేన్స్' దృశ్యం కమనీయకరం. రామాయణం ఎందుకు చదవాలి? మానవత్వమే మహోన్నతం.. ఆర్టికల్స్ ఎంతో బాగున్నాయి

-నేమాని సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం.

## భావ వీచిక



### ధరిత్రి..జనయిత్రి

**భూమాత!** సకల జీవులకు ఆధారభూతమైంది భూమి.. భూమిలోనే కదా అనేకానేక నిక్షేపాలున్నది! జల వనరులు, ఖనిజాలు, బొగ్గు, పెట్రోలియం, సహజ వాయువు వంటి శక్తి వనరులు.. అన్నిటికీ మించి భూమినుంచే కదా చెట్లు మొలకెత్తి మనిషికి ప్రాణవాయువును, ఆహారాన్ని, నీడను, అనేకానేక వస్తు సముదాయాలను, మనిషిని అనేకానేక రుగ్మతలనుంచి కాపాడే మందులను.. అందిస్తోంది. మరి మనిషి మనుగడకు ఏడుగడ అయిన భూమిని కాపాడుకోవటం మన ధర్మంకదా. భూమిని కాపాడుకోవటమంటే మనల్ని మనం కాపాడుకోవటమే. ఏప్రిల్ 22న ప్రపంచ ధరిత్రి దినోత్సవం.. మన కర్తవ్యాన్ని మరోమారు గుర్తుచేసే రోజు. నేలను కాపాడుకోవటమంటే దాన్ని సారవంతంగా, సజీవంగా ఉండేలా సంరక్షించుకోవాలి. తాత్కాలిక లాభాలను ఆశించి, రసాయనిక ఎరువులు, రసాయనిక క్రిమిసంహారకాలు వాడటం వల్ల భూసారం తగ్గి, బీడుగా మారుతుంది. అందువల్ల సేంద్రీయ వ్యవసాయ పద్ధతుల నుపయోగించి నేల సారాన్ని కాపాడుకోవాలి. అలాగే భూమికోతకు గురికాకుండా జాగ్రత్తపడాలి. అందుకు మళ్లీ మనం చేయాల్సింది చెట్ల పెంపకమే. స్వార్థంకోసం అడవులను కొట్టేయడం మానుకోవాలి.

ముఖ్యంగా మనుషులంతా గుర్తించాల్సింది, గుర్తుంచుకోవాల్సింది ఏమిటంటే భూమి పునరుత్పత్తి చేసే వనరుకాదు. అంటే మనం కొత్తగా భూమిని సృష్టించలేం. ఉన్న భూమిని కాపాడుకోవటమొక్కటే మన ముందున్న మార్గం. మనం నివసించే నేల నివాసయోగ్యంగా, మన మనుగడకు అన్ని విధాల ఉపయోగపడేలా ఉండాలి. అలా ఉండాలంటే ప్రతి ఒక్కరు భూమాతను కన్నతల్లిగా కాపాడుకోవాలి. ఇది ఏ ఒక్కరోజుకో పరిమితమయ్యే బాధ్యత కాదు. నిరంతర కొనసాగింపుగా ఉండాలి. ధరిత్రీ దినోత్సవం రోజున భూ పరిరక్షణ విషయమై కృషికి పునరంకితం కావాలి. ధరిత్రి దినోత్సవం గురించిన చైతన్యం ప్రపంచం నలుమూలలా, ప్రతి ఒక్కరిలో వ్యాపింపజేయాలి. ధరిత్రి సంరక్షణలోనే దాగుంది ప్రాణికోటి శ్రేయస్సు!

'సంఘీ'భావం

# సంతోష భారత్ ఎప్పుడో!



సంతోషం సగం బలం... అన్నారు పెద్దలు. మారిన సమకాలీన పరిస్థితుల్లో ఈ నానుడిని కాస్త మార్చుకోవాల్సిన అవసరం ఏర్పడింది. సంతోషమే సంపూర్ణ బలం అని చెప్పక తప్పదు. మనిషికైనా, సమాజానికైనా, దేశానికైనా సంతోషమే సంపూర్ణ బలాన్నిస్తుంది. అదే సమాజ వికాసానికి, సంపదకు, సరైన జీవన ప్రమాణానికి కీలకంగా మారుతుంది. అయితే సంతోషం స్కోర్‌లో భారత్ బాగా వెనకబడింది. అదెలాగంటే- గత ఏడాదితో పోలిస్తే కూడా భారతదేశం మరింతగా సంతోషంలో వెనకబడిపోయింది. పాలకులకు ఈ నివేదికను పట్టించుకునే సమయం, ఓపిక ఉండకపోవచ్చు. సంతోష స్కోర్‌ను పెంచడానికి అగ్రస్థానంలో ఉన్న దేశాలు ఏం చేస్తున్నాయనే పరిశీలన చేసే దృఢ సంకల్పం లేకపోవచ్చు. అందుకే భారత్ సంతోషం స్కోర్ ఏడాదికేడాది దిగజారిపోతోంది.

మార్చి 20న ప్రతి ఏడాది అంతర్జాతీయ సంతోష దినోత్సవం జరుగుతుంది. ఐక్యరాజ్యసమితి ఈ సందర్భంగా 2017కు సంబంధించిన అంతర్జాతీయ సంతోష నివేదికను విడుదల చేసింది. ఈ నివేదికకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. దీన్ని పూర్తి స్థాయిలో పరిశీలించి అధ్యయనం చేస్తే అనేక ఆసక్తికర విషయాలు వెల్లడవుతాయి. 155 దేశాల సంతోష స్కోర్‌ను ఐక్యరాజ్యసమితి విడుదల చేస్తే అందులో భారతదేశ స్థానం 122. అదే గత ఏడాది ర్యాంక్ 118. అంటే మరో నాలుగు స్థానాలు దిగజారినట్లేనని నివేదిక స్పష్టం చేసింది.

ఆయా దేశాల్లో తలసరి ఆదాయం, ఆయుర్దాయం, అవినీతి, సామాజిక మద్దతు, నమ్మకం, స్వేచ్ఛ, దాతృత్వం.. లాంటి అంశాల ఆధారంగా సంతోష స్కోర్‌ను రూపొందిస్తారు. దీని విలువ "1-10" మధ్య ఉంటుంది. దీనిని మొట్టమొదట 2012లో ప్రకటించారు. 2017 నివేదిక అయిదవది. దీనిప్రకారం చూస్తే హాపినెస్ స్కోర్‌లో నార్వే మొదటి స్థానంలో ఉండగా; డెన్‌మార్క్ రెండో స్థానం; ఐస్‌ల్యాండ్ మూడో స్థానం; స్విట్జర్లాండ్ నాలుగో స్థానం; ఫిన్‌లాండ్ అయిదో స్థానం; నెదర్లాండ్స్ ఆరో స్థానం; కెనడా ఏడో స్థానం; న్యూజిలాండ్ ఎనిమిదో స్థానం; ఆస్ట్రేలియా తొమ్మిదో స్థానం; స్వీడన్ పదో స్థానంలో ఉన్నాయి. అంటే ఈ దేశాల్లోనే తలసరి ఆదాయమే కాకుండా సగటు ఆయుఃప్రమాణం అధికంగా ఉంది. అవినీతి జాడ లేదు. పరస్పర విశ్వాసం అధికంగా ఉంది. అన్నిటికన్నా ముఖ్యంగా స్వేచ్ఛ అపరిమితంగా ఉంది. దీంతోపాటుగా సేవ కూడా అత్యధికంగా ఉంది. దీనివల్లే చిన్న దేశాలైనా సంతోషం స్కోర్‌లో పెద్ద దేశాలుగా ఇతర దేశాలకు ఆదర్శ దేశాలుగా పై పది నిలిచాయి.

ప్రపంచంలోనే స్వేచ్ఛకు, ఆహ్లాదకర వాతావరణానికి, మెరుగైన ఆయుఃప్రమాణానికి కేరాఫ్‌గా నిలిచిన అమెరికా తొలి పది స్థానాల్లో లేదు. దీని స్థానం పధ్నాలుగుగా నివేదిక పేర్కొన్నది. ఆశ్చర్యకరమేమిటంటే మనకంటే అన్ని విషయాల్లో వెనకబడివున్న పాకిస్థాన్ 80వ ర్యాంక్ సాధించగా, పొరుగునే ఉన్న భూటాన్ 97, నేపాల్ 99 ర్యాంకులు సాధించి మనకన్నా మెరుగ్గా ఉన్నాయి. చివరకు బంగ్లాదేశ్, శ్రీలంకలు 120వ స్థానాల్లో నిలవగా; ఆఫ్ఘనిస్థాన్ 140వ ర్యాంక్ సాధించాయి. ఇక బ్రిక్స్ దేశాలను పరిశీలిస్తే బ్రెజిల్ 22వ ర్యాంకు, రష్యా 49, చైనా 79 ర్యాంకును, దక్షిణాఫ్రికా 101 ర్యాంకును సాధించాయి. చివరి స్థానంలో సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ నిలిచింది. దీనికి 155వ ర్యాంకు ఇవ్వగా, ఇంతకుముందు గురుండీకి 154, టాంజానియా 153, సిరియా 152, రువాండాకు 151 ర్యాంకులు వచ్చాయి. అంటే ఇవన్నీ దాదాపుగా సంతోష స్కోరులో దిగువలో ఉన్నాయి. నివేదిక వివరాలు అలా ఉంచితే, సంతోషం స్కోర్‌ను పెంచడానికి తీసుకోవలసిన చర్యలేమిటనేది భారత పాలకులు ఇప్పుడైనా చర్చించాలి. ఈ నివేదిక ఎలాగు ప్రతి ఏడాది విడుదల చేస్తారు కనుక కనీసం వచ్చే సంవత్సరానికైనా భారతదేశం సంతోషం స్కోర్ పెంచడానికి పాలకులు నిర్దిష్ట కార్యాచరణ ప్రణాళికను రూపొందించుకుంటే మంచిది. లేదంటే నివేదికను చెత్తబుట్టలో వేస్తే ప్రజలు పాలకులను క్షమించరు.

కుటుంబాన్ని ఉదాహరణగా తీసుకుంటే సభ్యులంతా ఆనందంగా, సంతోషంగా జీవితం సాగించాలంటే ఏం కావాలో ముందు ఇక్కడ చర్చిద్దాం. ఒక డబ్బే జీవితానికి జీవనానికి సంతోషం ఇవ్వదు. ప్రతి కుటుంబం గౌరవంగా జీవనం సాగించే విధంగా మౌలిక వసతులు ఉండాలి. అంటే నివసించడానికి గౌరవప్రదమైన ఇల్లు, ఉదర పోషణకు అవసరమైన ఆహారం, దానికితోడు సరైన వస్త్రాలు ఉండాలి. డబ్బుకోసం అక్రమ మార్గాలకు మళ్లకుండా ప్రతి కుటుంబం వ్యాపారమో, వాణిజ్యమో, ఉద్యోగమో (అది ప్రైవేటుది కావొచ్చు, ప్రభుత్వానిది కావొచ్చు) చేయాలి. అవి వారి నెలవారీ ఖర్చులకు పోను కొంతైనా మిగిలే పరిస్థితి ఉండాలి. అప్పుడే వారు చీకూ, చింతా లేకుండా ఎలాంటి అశాంతి లేకుండా తాము అనుకున్న గౌరవప్రద జీవనాన్ని ఆనందంగా గడుపుతారు. ఆ ఆనందమే లేకుంటే కుటుంబంలో విషాదం రాజ్యమేలుతుంది. అది క్రమంగా మానసిక కుంగుబాటుకు, ఆ తరువాత తీవ్రమై ఆత్మహత్యకు కూడా కారణమవుతుంది. ఇవన్నీ మనం నిత్యం చూసేవే, వింటున్నవే. ఇది కుటుంబానికైతే నెలవారి ఆదాయం కాగా, దేశానికి తలసరి ఆదాయంగా పేర్కొనవచ్చు. ఎంత ఆదాయం ఎక్కువగా ఉంటే అంతగా కుటుంబాలైనా, దేశాలైనా ఆనందంగా ముందుకు సాగుతాయి. ఆదాయం ఒక్కటే కాకుండా అవినీతి ఎక్కడా కనిపించకూడదు. అవినీతిని ప్రోత్సహించకూడదు. అవినీతికి పాల్పడేవారిని, ప్రోత్సహించేవారిని కఠినాతి కఠినంగా శిక్షించాలి. దీనికితోడు మనిషి పీల్చే గాలి, తాగే నీరు, తినే ఆహారం కల్తీ కాకుండా కఠిన చట్టాలు తీసుకురావాలి. అన్నిటికన్నా ముఖ్యంగా తనకు నచ్చిన వృత్తిలో, తనకు నచ్చిన విధంగా జీవనం సాగించే స్వేచ్ఛ పౌరులకు ఖచ్చితంగా ఉండాలి. ఇవే దేశానికైనా, కుటుంబానికైనా సంతోషాన్నిస్తాయి. ఆ సంతోషమే మనోనిబ్బరాన్ని, ఆత్మవిశ్వాసాన్ని అపరిమితంగా పెంచుతుంది. పనిని మరింతగా ప్రోత్సహిస్తుంది. అది కుటుంబ స్కోర్‌నే కాకుండా దేశాల స్కోర్‌ను కూడా పెంచుతుంది. ఈ మొత్తం సంతోషానికి దారి తీసే అంశాలలో మనం ఎక్కడ వెనకబడ్డామో, ఎలా ముందుకు వెళ్లాలో పాలకులు ప్రత్యేక కమిటీలను ఏర్పాటు చేసైనా సరే భారతదేశ సంతోషం స్కోర్ అనూహ్యంగా ప్రపంచం ముందు పెరిగేలా చూడాల్సిన బాధ్యత అందరిపైనా ఉంది.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




- ఎ.వి.వి. ప్రసాద్

# చైనా మారదా!

**దలైలామా ఆధ్యాత్మికవాదం, బౌద్ధ ప్రబోధం ఎంత మాత్రం తలకెక్కని చైనా ఆయన కదలికల విషయంలో తలతిక్కగా మాట్లాడడంలో ఆశ్చర్యం లేకపోయినా హద్దులు మీరడం మాత్రం క్షమించరాని నేరమే. ఇంతకు ముందు ఆయన ప్రఖ్యాత బౌద్ధారామ కేంద్రమైన తవాంగ్‌ను ఆరు సార్లు సందర్శించారు. అయితే అప్పుడు లేని అభ్యంతరాన్ని ఇప్పుడు వ్యక్తం చేయడమే చైనాలో కొత్తగా కనిపిస్తున్న మార్పు. 1962 యుద్ధం తరువాత నుంచి క్షీణించిన సంబంధాలను పునరుద్ధరించుకొనకపోయినా, భారత్‌తో ఏదోవిధంగా తిరిగి కయ్యానికి సిద్ధం కావడమే చైనా వ్యూహంలా ఉంది. ఇందుకోసం భారత్‌చుట్టూ ఒక చక్రబంధాన్ని నిర్మిస్తూన్నట్లుగా కూడా చైనా కనిపిస్తోంది. ఇంతకాలం భారత్ మార్గదర్శకత్వంలో పయనిస్తున్న ఇరుగు పొరుగు దేశాలనన్నిటిని చైనా తన గుప్పెట్లోకి తీసుకోవడం వెనుకగల వ్యూహం బహుశా అదే అయి ఉండవచ్చు...**

**సాచ సాగె కోర చైనా మహమ్మారి**
**ఇండియాకు హెచ్చె ఇరుగు పోరు;**
**వదరుబోతుకింక వాతలే తగునయా!**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

చైనా మళ్లీ కయ్యానికి కాలుదువ్వుతోంది. టిబెటన్ల బౌద్ధ గురువు దలైలామా అరుణాచల్ ప్రదేశ్‌లో జరిపిన పర్యటనను అడ్డుపెట్టుకొని భారత్‌పై తన అక్కసునంతా వెళ్లగక్కింది. ఇలాంటి కస్సు బుస్సులు చైనాకూ కొత్తకాదు, భారత్‌కూ కొత్తకాకపోయినా– తాజా గర్జనలో 'నువ్వెంత' అనే ధిక్కారస్వరం మరింత బలంగా వినిపించినట్లు కనిపిస్తోంది. ఏదో ఒకవిధంగా బెదిరించి సరిహద్దుల్లోని అరుణాచల్‌లో తిష్టవేయడానికి చైనా చేయని ప్రయత్నమంటూ లేకపోయినా ఏ ఒక్కటి ఫలించకపోవడంతో 'సందర్భం' వచ్చినపుడల్లా గర్జనలు చేయడం మాత్రం విసుగులేకుండా కొనసాగిస్తోంది. దలైలామా పర్యటన నేపథ్యంలో చైనా హూంకరింపులు అటువంటివే. అయితే ఆ తాటాకు చప్పుళ్లు చూసి వెన్ను చూపే 'నీరస' స్థితిలో భారత్ లేదనే విషయంకూడా ఈసారి బాగా అర్థమయి ఉంటుందనే అనిపిస్తుంది.

అరుణాచల్ తమదే అనే అర్థంలేని వాదనతో గిల్లికజ్జాలు పెట్టుకునే చైనా దలైలామా విషయంలోను, ఆయనకు భారత్ ఆశ్రయం ఇవ్వడంతోను మొదటినుంచి అగ్గిమీద గుగ్గిలమవుతూనే ఉంది. అరుణాచల్‌లోని వివాదాస్పద 'తవాంగ్' ప్రాంతాన్ని దలైలామా సందర్శించడం వెనుక భారత్ కవ్వింపు ధోరణి కనిపిస్తున్నదని ఆరోపిస్తూ దానిని తాము ఆమోదించబోమనీ, తగిన 'ప్రతీకార' చర్య తీసుకొంటామనీ హెచ్చరిస్తోంది. ఇది పూర్తిగా భారత్ ఆంతరంగిక విషయంలో చైనా జోక్యం చేసుకోవడమే. ఆయన టిబెట్‌లోకి తిరిగి ప్రవేశిస్తే చైనా ఆరోపణలు చేసినా అర్థం ఉంటుంది. కానీ భారత్‌లో అంతర్భాగమైన అరుణాచల్ లోకి, దానిలో అంతర్భాగమైన తవాంగ్‌లోకి దలైలామా ప్రవేశిస్తే చైనాకు ఎందుకు అభ్యంతరం? అంటే గిల్లికజ్జాలు చైనాకు ఒక ఆటగా మారాయనేకదా అర్థం? తవాంగ్‌లోని బౌద్ధారామాలను సందర్శించటం కోసమేగాని మరో ప్రయోజనం కోసం దలైలామా ఆ పర్యటనను చేపట్టలేదు. ఏప్రిల్ మొదటివారం నుంచి తొమ్మిది రోజులపాటు ఆ రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో పర్యటించిన దలైలామా చివరగా తవాంగ్ బౌద్ధారామాలను కూడా సందర్శించారు. అయితే మొదటినుంచి ఆయన పర్యటనను వ్యతిరేకిస్తున్న చైనా భారత్‌పై విరుచుకుపడుతూ పర్యవసానాలు తీవ్రంగా ఉంటాయంటూ హెచ్చరికలు చేసింది. దీనిని బట్టి ఎప్పుడెప్పుడు యుద్ధానికి సిద్ధమవుదామా! అనే తహతహ చైనా పాలకుల్లో ఉన్నట్లే అనుకోవాలికదా! తమదేశ ప్రయోజనాలకు విఘాతం కలిగించేలా దలైలామా తొమ్మిదిరోజుల పర్యటనకు భారత్ అనుమతించదని కూడా చైనా ఆక్షేపణ. పర్యటనలో దలైలామా వెంట కేంద్రహోంశాఖ సహాయమంత్రి కిరణ్ రిజిజు కూడా ఉండడంతో అది మరింత ఆసక్తికరంగా మారింది. భారత్–చైనా సంబంధాల్లో మరిన్ని ఉద్రిక్తతలు సృష్టించడంతోపాటు సరిహద్దు వివాదాన్ని ఈ పర్యటన మరోసారి తెరపైకి తెచ్చింది.

సాధారణంగా ఎలాంటి వివాదాల జోలికి వెళ్లని దలైలామాను, ఆయన పర్యటనను వివాదం చేస్తే ఆ నేపథ్యంలో అరుణాచల్‌పై మరోసారి రచ్చకెక్కవచ్చునే దురుద్దేశం చైనాకు బాగా ఉన్నట్లు దీనితో స్పష్టమవుతోంది. హిమాచల్ ప్రదేశ్‌లోని ధర్మశాలలో ఆరామాన్ని ఏర్పాటుచేసుకొని దాదాపు ఆరుదశాబ్దాలుగా భారత్‌లో నివసిస్తున్న దలైలామా (81)ను తిరిగి టిబెట్‌కు రానివ్వకుండా చైనా చాలా ఆంక్షలే విధించింది. అక్కడి కమ్యూనిస్టు ప్రభుత్వం దలైలామాకు పోటీగా మరో పంచన్‌లామాను సృష్టించడానికి కూడా సిద్ధమైంది. అయితే టిబెటన్లు ఇప్పటికి దలైలామా ఆధ్యాత్మిక మార్గాన్నే అనుసరిస్తూ ఆయన్నే తమ గురువుగా భావిస్తున్నారు. టిబెట్‌కు స్వయంప్రతిపత్తి ఇవ్వాలనే డిమాండ్‌ను అనేక దశాబ్దాలుగా తొక్కిపెడుతున్న చైనా దలైలామా తిరిగి టిబెట్‌కు వస్తే ఎక్కడ విప్లవం చెలరేగుతుందోననే భయంతో ఆయన్ని అక్కడ అడుగుపెట్టకుండా శాసిస్తోంది. నోబెల్ శాంతి విజేత అయిన ఆయన ఎక్కడ పర్యటించడానికి వెళ్లినా చైనా దానిని వివాదాస్పదం చేస్తూ అంతర్జాతీయ సమస్యగా మారుస్తోంది. చైనా ధోరణి పట్ల దలైలామా కూడా గతంలో పలుమార్లు తీవ్ర అభ్యంతరం వ్యక్తంచేశారు. తాము చైనాలోగాని, టిబెట్‌లోగాని లేకపోయినా చైనా తనను నీడలా వెన్నాడుతున్నదనీ, తనవల్ల చైనాకు ఎలాంటి నష్టంలేకపోయినా తనకు మాత్రం ఎంతో నష్టాన్ని కలిగిస్తున్నదనీ, గతంలో ఆయన పలుమార్లు వాపోయారు. తాజా పర్యటనలో కూడా ఆయన ఇదే విషయాన్ని స్పష్టం చేస్తూ "ఒకే చైనా విధానాన్ని నేను వ్యతిరేకించడంలేదు... కానీ నన్ను చైనా ఇప్పటికి వ్యతిరేకిస్తోంది" అని ఆవేదనగా అన్నారు. అయినా చైనా ధోరణిలో ఎలాంటి మార్పు కనిపించకపోవడం గమనించవలసిన అంశం. చైనాలో ఉన్న 40 కోట్ల మంది బౌద్ధులకు ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం ఇప్పటికి రాలేదంటున్న దలైలామా కమ్యూనిస్టు పాలకుల బెదిరింపులకు తాను భయపడబోననీ, అతిత్వరలో టిబెట్‌కు కూడా తిరిగి వెళ్తాననీ అంటున్నారు. ఎక్కడికి వెళ్లినా అహింస, శాంతి, సామరస్యాలను మాత్రమే బోధించే దలైలామాను పెద్ద రాజకీయ సమస్యగా చైనా మార్చడం వెనుక గట్టి రాజకీయ వ్యూహమే ఉందనిపిస్తుంది. నిజానికి దలైలామా పిలుపునిస్తే, చైనాలో ఉన్న బౌద్ధులందరు ఆగ్రహిస్తే టిబెట్‌కు స్వాతంత్ర్యం కొద్ది నిమిషాల పనే. కానీ ఒక గొప్ప ఆధ్యాత్మిక గురువుగా, గాంధీజీ



అహింసా సూత్రాలన్నీ అనుసరించే ధార్మిక వేత్తగా దలైలామా అలాంటి విప్లవాల జోలికి పోకుండా ఎప్పటికైనా కమ్యూనిస్టు పాలకుల మనసు కరగకపోతుందా? అని నిరీక్షిస్తూనే ధర్మాశాల నుంచి ధార్మిక ప్రచారం చేస్తూ కాలం గడుపుతున్నారు. అయినా చైనా వదలకుండా గిల్లుతోంది, కజ్జాలు పెడుతోంది.

********

దలైలామా ఆధ్యాత్మికవాదం, బౌద్ధ ప్రబోధం ఎంత మాత్రం తలకెక్కని చైనా ఆయన కదలికల విషయంలో తలతిక్కగా మాట్లాడడంలో ఆశ్చర్యం లేకపోయినా హద్దులు మీరడం మాత్రం క్షమించరాని నేరమే. ఇంతకు ముందు ఆయన ప్రఖ్యాత బౌద్ధారామ కేంద్రమైన తవాంగ్‌ను ఆరు సార్లు సందర్శించారు. అయితే అప్పుడు లేని అభ్యంతరాన్ని ఇప్పుడు వ్యక్తం చేయడమే చైనాలో కొత్తగా కనిపిస్తున్న మార్పు. 1962 యుద్ధం తరువాత నుంచి క్షీణించిన సంబంధాలను పునరుద్ధరించుకోనకపోయినా, భారత్‌తో ఏదోవిధంగా తిరిగి కయ్యానికి సిద్ధం కావడమే చైనా వ్యూహంలా ఉంది. ఇందు కోసం భారత్‌చుట్టూ ఒక చక్రబంధాన్ని నిర్మిస్తూన్నట్లుగా కూడా చైనా కనిపిస్తోంది. ఇంతకాలం భారత్ మార్గదర్శకత్వంలో పయనిస్తున్న ఇరుగు పొరుగు దేశాలనన్నిటిని చైనా తన గుప్పెట్లోకి తీసుకోవడం వెనుకగల వ్యూహం బహుశా అదే అయి ఉండవచ్చు. చైనా నిరసనను జాగ్రత్తగా గమనిస్తే దలైలామా కంటె అరుణాచల్‌పై ఆ దేశం కన్ను ఎలా పడుతు న్నదో స్పష్టంగా అర్థమవుతుంది. దాదాపు 90 వేల చదరపు కిలోమీటర్ల తమ భూభాగం భారత్ స్వాధీనంలో ఉన్నదన్నది చైనా ఆరోపణ. అది అసత్యమనీ, మన భూభాగంలో 38 వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతాన్ని చైనాయే ఆక్రమించుకొన్న దనేది భారత్ ఆరోపణ. ఈ ఆరోపణలో దేనిలో వాస్తవమెంత? అనేది ఐదున్నర దశాబ్దాలుగా నలుగుతూనే ఉంది. పరస్పర చర్చల ద్వారా వివాదానికి పరిష్కారం కనుగొనాలనే అవగాహనకు కొన్ని దశాబ్దాల క్రితమే వచ్చినా, ఇప్పటికి దాదాపు 16 సార్లు ఉభయ వర్గాలు సరిహద్దు వివాదంపై చర్చలు జరిపినా ఎక్కడి గొంగళి అక్కడే ఉంది.



చైనా విమానాలు అరుణాచల్ ప్రాంతంలోకి చొచ్చుకురావడం, సరిహద్దుల వద్ద సైనికులు కాల్పులు జరపడం వంటి ఘటనలు తరచుగా జరుగుతున్నవే అయినా 1962 నాటి యుద్ధ పరిస్థితి మళ్లీ తలెత్తకపోవడం కొంతలో కొంత సంతృప్తి కలిగించే అంశమే. అయినా ఏదో ఒక 'దుందుడుకు' ప్రకటనచేస్తూ చైనా ఇలా భారత్‌ను తరచుగా రెచ్చగొడుతూనే ఉంది. అయితే ఈసారి గతంలోకంటె హెచ్చు స్వరంతో చైనా గర్జించడమే చర్చనీయాంశమవుతోంది.

ఇక్కడ రెండు ఒకే రకమైన అంశాలున్నాయి. మొదటిది దలైలామాను చైనా కొన్ని దశాబ్దాలుగా వ్యతిరేకించడం; రెండోది భారత్‌ను చైనా కొద్ది దశాబ్దాలుగా వ్యతిరేకించడం. తాను వ్యతిరేకించే దలైలామాకు భారత్ ఆశ్రయమివ్వడమేగాక, తమ ప్రాంతమైన (చైనా అలాగే అనుకొంటోంది) తవాంగ్‌లోకి ఆయన్ని అనుమతించి మళ్లీ కయ్యానికి సిద్ధమవుతోందని చైనా వ్యాఖ్యానించడాన్ని చూస్తే అసలు ఎవరు ఎవరిని రెచ్చగొడుతున్నారో స్పష్టంగా అర్థమవుతుంది. తవాంగ్ అనేది భారత్‌లో అంతర్భాగంగా ఉన్న అరుణాచల్‌లో అంతర్భాగమైన ప్రాంతం. దానిపై హక్కును ప్రకటించుకోవడం చైనా సామ్రాజ్యవాద దురహంకారానికి ప్రత్యక్ష నిదర్శనం. అటువంటప్పుడు చైనా భారత్‌పై ఆరోపణలు ఏ విధంగా చేయగలుగుతుంది? భూకబ్జాకు దిగుతున్నది, అక్రమంగా ఆక్రమణలకు సిద్ధమవుతున్నది చైనాయే. అందుకోసం మరోపక్క పాక్‌నుకూడా భారత్‌కు వ్యతిరేకంగా మరింత ఎగదోస్తోంది. పాక్‌కు భారీగా సాయం అందిస్తున్నట్లుగా నటిస్తూ ప్రత్యక్షంగా, పరోక్షంగా భారత్‌వైపు ఉసిగొల్పుతోంది. ఇండో-పాక్ సరిహద్దుల వద్ద తరచుగా జరుగుతున్న కాల్పుల ఘటనలు, ఉగ్రదాడులు పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

అయితే తాను యుద్ధం చేయడమో, లేకుంటే పాక్‌చేత చేయించడమో- ఇదే ప్రస్తుతం చైనా వ్యూహంలా కనిపిస్తుంది. అందుకే దలైలామా పర్యటనను అంతగా వివాదాస్పదం చేస్తున్నదనిపిస్తుంది.

దలైలామా విషయంలో భారత్‌ను నియంత్రించగలిగితే, అరుణాచల్‌పై కూడా మరికొంత పట్టు సాధించగలననే అభిప్రాయంతో చైనా ఉండి ఉండవచ్చనే అనుమానం కూడా తాజా వాగ్యుద్ధాన్ని బట్టి కలుగుతోంది. మోడీ ప్రధాని అయిన తర్వాత చైనా అధ్యక్షుడు జిన్ పింగ్ న్యూఢిల్లీ వచ్చినపుడు కొత్త స్నేహబంధానికి తలుపులు తెరచి నట్లు కనిపించారుగాని ఆ తర్వాత కొద్ది రోజులకే చైనా మ్యాప్‌లో అరుణాచల్‌ను చూపించే ప్రయత్నాలు మరోసారి జరిగాయి. అలాగే తర్వాత ఉభయదేశాల మధ్య వాణిజ్య, దౌత్య సంబంధాల మెరుగు దలకు కొన్ని ఒప్పందాలు జరిగాయిగాని అవి విచ్ఛిన్నమయ్యే రీతిలో ఇప్పుడు మళ్లీ చైనా జూలు దులుపుతోంది. చైనా తాజా ఆగ్రహానికి వెనుక మరో కారణం కూడా కనిపిస్తుంది. దక్షిణ చైనా సముద్రంలో ఆక్రమణలకు పాల్పడుతున్న చైనాను అమెరికా తీవ్రంగా వ్యతిరేకిస్తు న్న విషయం విదితమే. జిన్‌పింగ్ వైఖరికి వ్యతిరేకంగా ట్రంప్ ఇటీవల కొన్ని ప్రకటనలు కూడా చేశారు. ఐతే వారిద్దరు కొద్దిరోజుల క్రితం వైట్‌హౌస్‌లో సమావే శమైనప్పుడు ఈ అంశం ప్రస్తావనకు రాక పోయినా, దక్షిణ చైనా సముద్రం విషయం లో తమ అభిప్రాయంలో మార్పు లేదని తర్వాత ట్రంప్ ప్రకటించిన దాన్ని బట్టి అమెరికా-చైనా ఎప్పటికీ ఒక ఒరలో ఇమడలేవనే విషయం స్పష్టమవుతోంది. అమెరికా వాదనకు భారత్ మద్దతు ఇస్తుండడం తో అది కూడా చైనా తాజా ఆగ్రహానికి మరో కారణమై ఉంటుందనీ, అందుకే దలైలామా పర్యటనను అంతగా వివాదాస్పదం చేస్తున్నదనీ అనిపిస్తుంది.

భారత్‌ను చక్రబంధంలో ఇరికించడానికి వీలుగా పాక్‌ను అదుపులో ఉంచుకొనడంతోపాటు అటు భూటాన్, నేపాల్, ఇటు శ్రీలంకను కూడా గుప్పెట్లోకి తీసుకొనడానికి చైనా అనేక ప్రయత్నాలు చేస్తోంది. అంటే ఇంత కాలం భారత్‌కు ఆప్తమిత్రులుగా ఉన్న దేశా లన్నిటిపై చైనా తన అధికారం చెలాయించే పరిస్థితి ఏర్పడుతున్న దన్నమాట. అంతేగాక పసిఫిక్ భాగస్వామ్య ఒప్పందం (టిపిపి) నుంచి అమెరికా బయటకు ఆరవడంతో కెనడా, మలేసియా, సింగ పూర్, ఆస్ట్రేలియా తదితరదేశాలు చైనాతో చెలిమికి ప్రయత్నాలు ఆరంభించడం దానికి మరింత 'బలుపు'గా మారుతోంది. బహుశా ఈ కారణాల వల్లనే గతంలో ఎన్నడు లేనంతగా భారత్‌పై చైనా ఇంతగా ఉరుముతున్నట్లు కనిపిస్తుంది. భారత్‌కు అణు సరఫరా దేశాల కూటమిలో సభ్యత్వం రాకుండా అడ్డుపుల్ల వేస్తున్న చైనా అంతటితో ఆగకుండా సమితి భద్రతామండలిలో, మనదేశానికి శాశ్వత సభ్యత్వం రాకుండా కూడా అడ్డుపడుతోంది. అమెరికా, రష్యా, జపాన్‌లు అంగీ కరించినా చైనా మాత్రం అందుకు వీటో చెబుతూనే ఉంది. దలైలామాకు ఇస్తున్న ఆశ్రయం ఉపసంహరించుకోవాలని కూడా చైనా భారత్‌పై చాలా కాలం నుండే ఒత్తిడి తెస్తోంది. దానికి అంగీకరించక పోవడంతో అవకాశం దొరికినప్పుడల్లా భారత్‌పై కయ్యానికి కాలు దువ్వుతోంది.

చైనా ఈ దురహంకారాన్ని అదుపు చేసుకోనట్లయితే అది ఆ దేశానికే ప్రమాదం తెస్తుంది. టిబెట్‌కు స్వాతంత్ర్యం ఇవ్వకుండా అణగదొక్కుతున్న చైనా భారత్ ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవడం క్షమార్హం కాని నేరం. కమ్యూనిస్టులుగా చెప్పుకొనే చైనా పాలకులు నిజమైన కమ్యూనిజానికి అర్థం తెలుసుకోవడం చాలా అవసరం. కమ్యూనిస్టులంటే కబ్జాలకు పాల్పడేవారు కాదనే విషయం జిన్‌పింగ్ వంటి పాలకులు ఇకనైనా తెలుసుకోవడం మరింత అవసరం.

# పుట్టకుండానే మరణశిక్ష!

## విష సంస్కృతి..విషమ పరిస్థితి

కవర్ స్టోరీ

పెట్ల వెంకటేశం

కన్ను తెరిస్తే జననం.. కన్నుమూస్తే మరణం.. ఇది రెప్పపాటులో సాగే జీవనయానం తల్లి కడుపులో తొమ్మిది మాసాలు తలదాచుకునే కొత్త బాటసారి ఈ లోకంలోకి అడుగుపెట్టక ముందే మరణశాసనానికి బలవుతున్నాడంటే ఎంత దారుణం! ఆ బాటసారి 'మగ' అయితే రక్షితుడే. 'ఆడ' అయితే శిక్షితురాలే..ఈ తీర్పు ఎవరిది? దురాచారాలు, దుర్నీతితో కూడిన సమాజానిదా? లింగనిర్ధారణ పరీక్షలతో ఫలానా పుట్టుక అని తేలితే ఆ తల్లిపేగుకు తెలియకుండానే క్రూరంగా పెరికివేసే రాక్షసత్వాన్ని శిక్షించడానికి న్యాయపీఠాలు, చట్టాలూ ఉన్నా చాపకింద నీరులా భ్రూణ హత్యలు నిరాఘాటంగా సాగుతున్నాయి. కర్ణాటక- మహారాష్ట్ర సరిహద్దుల్లో స్టెతస్కోప్ అంటే తెలియని బూటకపు డాక్టర్లు ఒక ముఠాగా కుమ్మక్కయి రోజుకు ఎన్నో గర్భస్థ పిండాల ఖండనకు పాల్పడుతున్నారు. వీరి చేతకాని వైద్యం చివరికి మాతృమూర్తులను మృతులుగా చేస్తోంది. చివరికి పాపం పండింది. బూటక వైద్య నాటకానికి తెరపడింది. ఈ దుర్ఘటన సంచలనం కలిగించింది. ఇది ఏ ఒక్క కర్ణాటక, మహారాష్ట్రల్లోనే జరగడంలేదు. ఆడబిడ్డ అంటేనే గిట్టని రాష్ట్రాలంతటా రావణకాష్టంలా రగులుతోంది. ఈ నేపథ్యంలో మనదేశంలో భ్రూణహత్యలకు కారణాలు, చట్టవిరుద్ధంగా, చీకట్లో సాగుతోన్న గర్భస్రావాల తంతు, ఫలితంగా తల్లులూ కన్నుమూస్తున్న వైనాలు, గర్భస్రావానికి సంబంధించిన చట్టాల తీరు..వగైరా అంశాలతో సమగ్ర కథనం ఈవారం మీకోసం...

అది మహైసాల్ గ్రామం. మహారాష్ట్ర-కర్ణాటక రాష్ట్రాల సరిహద్దులో సంగ్లీ జిల్లాలో కృష్ణానదీ తీరాన గల చిన్న గ్రామం. అక్కడ గల 'భర్తీ' ఆసుపత్రిలో లింగవివక్షతో గర్భస్రావ చికిత్సలు అనేకం జరిగాయన్న ఫిర్యాదులపై ప్రభుత్వం దర్యాప్తుకు ఆదేశించింది. 2016 మే 19వ తేదీ ఉదయం ఇద్దరు మెడికల్ ఆఫీసర్లు వచ్చి దర్యాప్తు చేపట్టారు. అందరినీ పిలిచారు. వివరాలు ఆరా తీశారు. రెండంతస్థుల ఆసుపత్రి భవనాన్ని, పరిసరాల్లోని కొన్ని నివాస గృహాలను పరిశీలించారు. ఆసుపత్రి రిజిస్టర్లను తనిఖీచేశారు. ఇద్దరు రోగులు తప్ప మరెవరూ వారికి కనిపించ లేదు. ఆసుపత్రి నిర్వాహకుడు హోమియోపతి వైద్యుడు డాక్టర్ బాబా సాహెబ్ ఖిద్రపూరెతో కరచాలనం చేసి సంతృప్తిగా వెళ్లిపోయారు. 10 నెలల తరువాత 2017 మార్చి 3న ఇద్దరు మెడికల్ ఆఫీసర్లు పోలీస్‌లను వెంటబెట్టుకొని ఆసుపత్రిని గాలించారు. ఈసారి ఆసుపత్రిలో డాక్టర్ ఖిద్రపూరె వారికి ఎక్కడా కనబడలేదు. ఆ ఆసుపత్రిలోని పరికరాలను సీజ్ చేశారు. స్థానికులను ప్రశ్నించి కొన్ని వివరాలను రాబట్ట గలిగారు. ఇంతకీ ఈ దాడులకు కారణం ఆ ఆసుపత్రిలోనే గర్భస్రావం చేయించుకున్న 26 ఏళ్ల స్వాతి జమ్దాదె మార్చి 1న చనిపోవడంతో కలెక్టర్‌కు అందిన ఫిర్యాదుతో దాడులు జరిగాయి. హోమియోపతి వైద్యుడు ఖిద్రపూరె ఆసుపత్రిలో ఆపరేషన్ థియేటర్ నిర్వహించడం తనిఖీకి వచ్చిన అధికారుల కంటపడింది. శస్త్రచికిత్సలు చేయడానికి ఆ డాక్టర్‌కు అర్హతలేదు. ఆసుపత్రి కిందిభాగంలో రెండుగదులు ..పడకలు ఉన్నాయి. ఇవన్నీ అనుమానాలను ప్రేరేపించడంతో వైద్యాధికారులు మరింత ముందుకు వెళ్లి స్థానికులను ప్రశ్నించారు. రోజూ ఆ ప్రాంతాన్ని పరిశీలించేసరికి మార్చి 5న వారికి ఆసుపత్రి పరిసరాల్లోనే 19 పిండాలు బయట పడ్డాయి. నీలం ప్లాస్టిక్ సంచులతో చుట్టి ఉన్న ఆ పిండాలు బురదతో నిండిన గోతిలో కప్పబడి ఉన్నాయి. గత 2నెలలుగా సాగిన గర్భస్రావాలకు ఆనవాలుగా ఇవి మిగిలాయి. రెండునెలల్లోనే 19 పిండాలు బయటపడితే గత ఎనిమిదేళ్లలో అక్కడ ఎన్ని గర్భస్రావాలు జరిగి ఉంటాయో, ఎన్ని భ్రూణ హత్యలకు దారితీసి ఉంటాయో అన్న చర్చ సాగింది. ఇప్పుడు దొరికిన 19 పిండాలను డిఎన్ఎ పరీక్షకు పంపారు. ఈ సంఘటనలను బట్టి డాక్టర్ ఖిద్రపూరె ఒక పెద్ద రాకెట్‌ను నడుపుతున్నాడని పోలీస్‌లకు వెల్లడయింది. దీంతో పోలీస్‌లు డాక్టర్ ఖిద్రపూరెతో సహ మరో 12 మందిని అరెస్టుచేశారు. కర్ణాటకకు చెందిన లింగనిర్ధారణ





చేసే ఇద్దరు డాక్టర్లు, ఈ రాకెట్‌కు సహకరిస్తున్న నలుగురు ఏజెంట్లు (బెల్గాం, కొత్తపూర్‌లకు చెందినవారు) అరెస్టయినవారిలో ఉన్నారు.

మార్చి 1న మృతి చెందిన 26 ఏళ్ల స్వాతి దీనగాథ ఈ సందర్భంగా బయటపడింది. మహైసాల్‌కు 40కి.మీ. దూరంలోని మానేర జురి గ్రామానికి చెందిన స్వాతికి ఇద్దరు పిల్లలున్నారు. 4 ఏళ్ల వయస్సు ఒకరిది కాగా, ఏడాది వయస్సు ఉన్న బిడ్డ ఇంకొకరు. ఇప్పుడు మూడో బిడ్డకు జన్మనివ్వడానికి ఆమె ఎదురు చూస్తోంది. ఆమె భర్త ప్రవీణ్ వ్యవసాయదారుడు. మగబిడ్డ కావాలనే పట్టుదలతో కడుపులోని బిడ్డ ఎవరో తెలుసుకోవ డానికి పరీక్ష చేయించు కోవడానికి ఫిబ్రవరి 28న డాక్టర్ ఖిద్రపూరె నిర్వహిస్తున్న భర్తీ ఆసుపత్రికి భార్యతో సహా వెళ్లాడు. అప్పటికి స్వాతి అయిదు నెలల గర్భిణి. ఖిద్రపూరెతో సంప్రదించి, అతని సలహాపై కర్ణాటక సరిహద్దులో ఉన్న కగ్వాడ్ గ్రామంలో డాక్టర్ శ్రీహరి ఘోడ్కే క్లినిక్‌కు భార్యను తీసుకువెళ్లాడు.




మహైసాల్ గ్రామానికి 6కి.మీ. దూరంలో ఆ క్లినిక్ ఉంది. అక్కడ సోనోగ్రఫీ పరీక్ష జరిగింది. ఆడపిల్ల పుడుతుందని తప్పనిసరిగా గర్భస్రావం చేయించాలని డాక్టర్ సలహా ఇచ్చాడు. ఆసుపత్రి లో లింగనిర్ధారణ పరీక్షలపై మహారాష్ట్ర ప్రభుత్వం నిఘా పెట్టడంతో ఆ డాక్టర్ సలహాపైనే తిరిగి ఖిద్రపూరె వద్దకు వచ్చి భర్తీ ఆసుపత్రిలో స్వాతిని భర్త మార్చి 1న చేర్పించాడు. పుదుచ్చేరినుంచి తన మామ సునీల్ జాదవ్‌ను రప్పించి స్వాతి గర్భస్రావం గురించి వివరించాడు. జాదవ్ ఒప్పుకోలేదు. అప్పటికే గర్భస్రావానికి రంగం సిద్ధమయింది. 4 గంటల వ్యవధిలో గర్భస్రావ మాత్రలు మిసోప్రోస్టాల్ కండరాలను తొలిచేశాయి. రక్తం ఏరులై పారింది. ఇంకా మిగిలిన తునకలను డాక్టర్లు తొలగించడం మొదలుపెట్టారు. స్వాతికి ఊపిరాడటం కష్టమైంది. పరిస్థితి విషమించడంతో 20కి.మీ. దూరాన గల మిరాజ్ ఆసుపత్రికి తరలిస్తుం డగా స్వాతి కన్నుమూసింది.

మిరాజ్ పోలీసులకు ఈ మరణ వార్త చేరింది. ఈ విషాదానికి సూత్రధారి డాక్టర్ ఖిద్రపూరె కొల్లపూర్ జిల్లాకు చెందిన కన్నాడ్ గ్రామానికి చెందినవాడు. బెల్గాంలో హోమియో పతి వైద్యవిద్యను అభ్యసించిన తరువాత మహైసాల్‌లో డిస్పెన్సరీ ప్రారంభించాడు. జ్వరం, నొప్పులు వంటి చిన్న రుగ్మతలకు వైద్యంచేసేవాడు. 2008లో భర్తీ ఆసుపత్రిని స్థాపించాడు. సంగ్లీనుంచి డాక్టర్లను రప్పించి హిస్టెరెక్టమీ, ఎపెండెక్ట మీ తదితర ఆపరేషన్లు చేయించేవాడు. సంగ్లీనుంచి వచ్చే డాక్టర్లు చాలామంది సంగ్లీ సివిల్ ఆసుపత్రిలో పనిచేసి రిటైరయిన వారే ఇన్ని అక్రమాలు చేస్తున్నా జిల్లా అధికారులు పట్టించుకోలేదు.


భర్తీ ఆసుపత్రి..ఇన్‌సెట్‌లో ఖిద్రపూరె

ఖిద్రపూరెకు ప్రభుత్వ ఉన్నత వర్గాలతో, నేతలతో సంబంధా లున్నందున ఎవరూ ఈ వ్యవహారం జోలికి రాలేదు. ఈ అవకతవకలపై సామాజిక ఉద్యమనేత అశోక్ వాడార్ తనపేరు లేకుండా కలెక్టర్‌కు లేఖ ద్వారా ఫిర్యాదుచేశాడు. ప్రి కాన్సెప్షన్ అండ్ ప్రి నాటల్ డయాగ్నస్టిక్ టెక్నిక్స్ చట్టం ఉల్లంఘనలపై నిఘావర్గాలకు సమాచారం ఎప్పటికప్పుడు అందించేవాడు. చివరికి కలెక్టర్ జోక్యం తో ఈ రాకెట్ గుట్టు బయటపడింది. డాక్టర్ ఖిద్రపూరె తాలూకు భర్తీ ఆసుపత్రికి కి.మీ. దూరంలో ప్రభుత్వ ప్రాథమిక ఆరోగ్యకేంద్రం ఉంది. గత మూడేళ్లుగా జిల్లా వైద్య ఆరోగ్య అధికారి రామ్ హంకరే దీన్ని పర్యవేక్షిస్తున్నారు. అయినా ఇవేం తనకు తెలియవని ఆయన నమ్మబలకడం గమనార్హం. "ఎవరికీ తెలియకుండా రాత్రుళ్లు ఇవన్నీ జరుగుతుండవచ్చు. అయినా దీనిపై కన్నువేసి ఉంచాల్సిన బాధ్యత సివిల్ సర్జన్‌దే" అని ముక్తసరిగా వివరణ ఇచ్చి తప్పించుకున్నారు.

"ఇది పూర్తిగా జిల్లా వైద్య ఆరోగ్య అధికారి బాధ్యత" అని సివిల్ సర్జన్ డాక్టర్ సంజయ్ సలుంకె దాటవేశారు. దీన్ని బట్టి డాక్టర్ ఖిద్రపూరె పలుకుబడి ఈ ప్రాంతంలో ఎలా పెట్టనిగోడలా ఉంటూ అక్రమరాజ్యాన్ని విస్తరింపజేసిందో తెలుస్తోంది. భర్తీ ఆసుపత్రిపై మార్చి 3న ఉన్నత వైద్యాధికారులు పోలీస్‌లతో కలిసి తనిఖీ చేసినప్పుడు అసుపత్రి కింద ఆపరేషన్ థియేటర్, రెండుగదులు, అబ్డామినల్ రిట్రాక్టర్లు, వంపు తిరిగిన పట్టకార్లు, అటువంటి సూదులు, ఎక్స్‌రే మెషిన్, అబార్షన్ మాత్రలు, డివేటర్, ఆక్సిజన్ సిలిండర్లు తదితర సర్జికల్ హంగులన్నీ కనిపించాయి. ఆపరేషన్ థియేటర్ నుంచి కిందవరకు పెద్ద గొట్టం, డ్రయినేజితో అనుసంధానించి ఉంది. గర్భస్రావం లేదా ఆపరేషన్ ద్వారా తొలగించిన పిండాలను ఈ గొట్టం ద్వారానే డ్రయినేజిలోకి నెట్టి వేస్తున్నట్టు పోలీస్‌ల దర్యాప్తులో బయటపడింది. మిసోప్రోస్టాల్ అనే మందు మాత్రలను ఉపయో గించే ఇక్కడ గర్భస్రావాలు చేస్తున్నారు. ఈ మాత్రలు సంగ్లీ డిస్ట్రిబ్యూటర్ సునీల్ ఖేడ్కర్ సరఫరా చేస్తున్నాడు. దర్యాప్తులో భాగంగా కవ్వార్‌లోని డాక్టర్ శ్రీహరి ఘోడ్కే ఆసుపత్రిలో రెండు సోనోగ్రఫీ మెషిన్లు దొరికాయి. సోనోగ్రఫీ డాక్టర్ శ్రీహరి చేసేవాడు. గర్భస్రావాల ఆపరేషన్లు మాత్రం భర్తీ ఆసుపత్రి లో జరిగేవి. శ్రీహరి ఘోడ్కే కూడా రాత్రుళ్లే పరీక్షలు చేసేవాడు.

కగ్వాడ్‌లో రిజిస్టర్డు పిసిపిఎన్‌డిటి సెంటర్లు 242 ఉండగా మెడికల్ సెంటర్లు 2400కు పైగా ఉండడం విశేషం. ఈ కేసుకు సంబంధించి కర్ణాటకలోని బీజాపూర్‌లో 64 ఏళ్ల డాక్టర్ రమేష్ దేవ్‌గేకర్‌ను పోలీస్‌లు అరెస్టుచేశారు. మెడికల్ రేడియో డయాగ్నసిస్‌లో డిప్లొమా పొందిన రమేష్ డాక్టర్ ఖిద్రపూరె ఆసుపత్రికి అబార్షన్ల కేసులు ఎక్కువగా పంపేవాడు. రెండు సోనోగ్రఫీ మెషిన్లను పోలీస్‌లు ఆయన నుంచి స్వాధీనం చేసుకున్నారు. ఆ ప్రాంతంలో 300మీ. పరిధిలోనే చిన్న, పెద్ద ఆసుపత్రులు నర్సింగ్ హోమ్‌లు 12, రేడియో బయాలజీ సెంటర్లు, ఎన్నో పుట్ట గొడుగుల్లా ఉన్నాయి. 2015కు ముందు రమేష్‌పై పిసిపిఎన్‌డిటి చట్టం ప్రకారం వైద్యాధికారులు కేసుపెట్టారు. ఇంకా ఆ కేసు కోర్టులో నడుస్తోంది.

ఏటా 19 మిలియన్ల నుంచి 20 మిలియన్ల మహిళలు ఏమాత్రం భద్రతలేని గర్భస్రావాలకు తమ జీవితాలను బలిచేసుకుంటున్నారు. పరిశుభ్రత లేని చోట అర్హత లేని వైద్యులు లేదా వైద్యవృత్తి శిక్షణ సాగిస్తున్నవారు తమ వృత్తి ప్రాపకం కోసం మిడిమిడి జ్ఞానంతో ఈ గర్భస్రావాలను నిర్వహిస్తున్నారు. ఏమాత్రం పొరపాటు లేకుండా అంటే సులువైన పద్ధతుల్లో గర్భస్రావాలను నిర్వహించవచ్చు. కానీ ప్రపంచం మొత్తంమీద జరుగుతున్న గర్భస్రావాల్లో సగానికి సగం భద్రతలేనివే అని అమెరికాకు చెంది వైద్య నిపుణుడు డాక్టర్ గిల్డా సెడ్జ్ (గట్‌మేచర్ ఇన్‌స్టిట్యూట్) అభిప్రాయ పడ్డారు. ముఖ్యంగా భారతదేశంలో భద్రతలేని గర్భస్రావాల సమస్యలు తీవ్రమవు తున్నాయి. 2012లో 6,20,472 గర్భస్రావాలు నమోదయ్యాయి.

అయితే వాస్తవానికి దేశంలో జరిగిన గర్భస్రావాల సంఖ్య 7 మిలియన్ల కన్నా ఎక్కువే అని తెలుస్తోంది. వీటిలో మూడోవంతు మాత్రమే బయట కొన్ని వైద్య ఆరోగ్య సౌకర్యాలున్నచోట జరుగు తున్నాయి. ఇవన్నీ వివాహేతర గర్భస్రావాలుకావు. భద్రతలేని

గర్భస్రావాలు చాలావరకు గర్భనిరోధక విధానాలు అవలంబించని, రిజిస్టర్డ్ ఆసుపత్రికి వెళ్లడానికి అవకాశం లేని వివాహితులవే. వీరు ఆర్థికంగా, వ్యక్తిగతంగా మరో బిడ్డ కావాలని కోరుకోవడంలేదు.

గర్భస్రావంలో పొరపాట్ల వల్ల భారతదేశంలో ప్రతి రెండు గంటలకు ఒక మహిళ చనిపోతోంది. ఈ సంఖ్య అసాధారణం. ఎక్కడ గర్భస్రావాలు జరుగుతున్నాయో ఎక్కడ పొరపాట్లు జరగ డానికి అవకాశం ఉందో ఎవరైనా పరిశీలిస్తే గర్భస్రావాల సంఖ్య అసాధారణమనే తోస్తుంది. గేబన్ లేదా సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్‌తో పోల్చిచూస్తే భారతదేశం ఆరోగ్య భద్రత కింద స్థూల దేశీయోత్పత్తిలో 3.9శాతం మాత్రమే ఖర్చుచేస్తోంది. గ్రామీణ ప్రభుత్వ వైద్య కేంద్రాల తీరు ఎలా ఉంటుందంటే రేకుల పైకప్పుతో ఉండే ఇటుకల కట్టడాలు తప్ప ఇంకేం లేవు. అప్పుడప్పుడు విద్యుత్ సరఫరా ఉంటుంది. గర్భిణులెవరైనా అక్కడ ప్రసవం కోసం వెళితే పక్క దొరకడమే మహాభాగ్యం. ఆ పక్క కూడా తుప్పు పట్టిన మంచాలే. అందుకని చాలామంది గర్భిణులు లేదా బాలింతలు చీకటి గదుల్లో మట్టినేలపై చెల్లాచెదురైన కట్లతో గడపక తప్పడంలేదు. ఈ వైద్య కేంద్రాల్లో 20 శాతం కన్నా తక్కువ కేంద్రాల్లోనే చట్టబద్ధంగా గర్భ స్రావాలలో తగిన సౌకర్యాలు ఉంటాయి. ఈ కారణంగా చాలామంది గ్రామీణ మహిళలు వేరే వైద్య కేంద్రాలు ఆశ్రయిస్తుంటారు. భారత దేశంలో గర్భస్రావ చట్టాలు సరళంగా ఉంటాయి. విస్తారంగా గర్భ స్రావాలకు అనుమ తించే 14 దేశాల్లో భారత్ ఒకటి. చట్టంపై లేనిపోని అపోహలు, వివాహేతర యువతులు గర్భవతులైతే సమాజం నుంచి తిరస్కారాలు, అవమానాలు ఎదురుకావడం తదితర కారణాల వల్ల చాలామంది ఎలాంటి సాయం పొందలేకపోతున్నారు. వర్ధమాన దేశాల్లో లాభనష్టాలు లేనిరీతిలో యువతులు బాలికలకు ఆపరేషన్లు నిర్వహిస్తున్న సేవాసంస్థ అధినేత అపరాజిత గొగొయ్ దీనిపై మాట్లాడుతూ సేవల గురించి సమాచారం లోపించడం ముఖ్యంగా యువతులను, కుటుంబాలను బలహీనపరుస్తోందని పేర్కొన్నారు. ఒక యువతికి గర్భస్రావం చేయడానికి కొన్ని సందర్భా ల్లో డాక్టర్లు తిరస్కరిస్తుంటారు. మహారాష్ట్రలో అత్యాచారానికి గురై గర్భం దాల్చిన 22 ఏళ్ల యువతి విషయంలో అలాగే జరిగింది. చట్ట ప్రకారం అనుమతి లభించినా, అవాంఛనీయ గర్భం దాల్చిన

# గర్భస్రావ కేసులు- సుప్రీంకోర్టు సూచనలు...

గర్భ నిరోధక చట్టం (మెడికల్ టెర్మినేషన్ ఆఫ్ ప్రెగ్నెన్సీ యాక్ట్-ఎంటిపి) 1971లో అమలులోకి వచ్చింది. ఈ చట్టం రాక ముందు గర్భస్రావం కేసులన్నీ అక్రమమే అని గుర్తించేవారు. గర్భిణి ప్రాణానికి ముప్పు ఏర్పడే కేసులను మాత్రం మినహాయించేవారు. ఐపిసి సెక్షన్ 3/2 ప్రకారం ఎవరైతే అక్రమంగా గర్భిణి కావడానికి బాధ్యులో వారికి జైలుశిక్ష పడుతుంది. అది మూడేళ్లవరకు విధించవచ్చు. బిడ్డను వేగంగా ప్రసవించాలని గర్భిణిపై ఒత్తిడి తెస్తే ఏడేళ్లవరకు శిక్ష విధిస్తారు. గర్భిణి అయిన తరువాత మొదటి 12 వారాల్లో గర్భస్రావంచేయించుకోడానికి ఎంటిపి చట్టం వీలు కల్పిస్తోంది. ఈ చట్టం ఐపిసిని కూడా కొన్ని అంశాల్లోఅధిగమిస్తోంది.



చట్టపరంగా విధించిన 20 వారాల గడువును దాటి గర్భస్రావానికి కొన్ని కేసుల్లో సుప్రీంకోర్టు అనుమతించింది. అత్యాచార బాధితురాలైన గర్భిణికి తన 24 వారాల గర్భాన్ని నిర్మూలించుకోవచ్చని ఇటీవలనే సుప్రీంకోర్టు అనుమతించింది. ఇది చట్టంలో విధించిన 20 వారాల గడువు నిబంధనను అతిక్రమించడమే అవుతుంది. అయితే ఆయా కేసుల పరిస్థితి బట్టి సుప్రీంకోర్టు తీర్పులు ఇవ్వక తప్పడం లేదు. గర్భిణిగా కొనసాగడానికి భౌతికంగా మానసికంగా ఆరోగ్యానికే ప్రమాదమని స్పష్టమయి నప్పు డు చట్టంలో ఉన్న 'గడువుకాలం' కన్నా గర్భిణి ప్రాణం కాపాడటమే ముఖ్యంగా సుప్రీంకోర్టు తీర్పులిస్తోంది. అత్యాచార బాధితురాలైన 14 ఏళ్ల గర్భిణి తన 25 వారాల గర్భస్థ పిండాన్ని తొలగించడానికి 2015 గుజరాత్ హైకోర్టు అనుమతించ లేదు. దీనిపై బాధితురాలు సుప్రీంకోర్టును ఆశ్రయించింది. వైద్యపరంగా పరీక్షించి, బాధితురాలి ఆకాంక్షను గమనించి మెడికల్ బోర్డ్ ప్యానెల్ గర్భస్రావానికే మొగ్గుచూపితే గర్భస్రావం చేయించుకోవచ్చని సుప్రీంకోర్టు తీర్పు వెలువరించింది. 2008లో గర్భస్థ పిండానికి గుండె వ్యాధులున్నట్లు గుర్తించినప్పటికీ 26 వారాల ఆ పిండాన్ని తొలగించడానికి, ముంబై హైకోర్టు ఒప్పుకోలేదు. గర్భిణిని రక్షించడానికి, తప్పని పరిస్థితుల్లో 20 వారాలు దాటిన పిండాన్ని తొలగించవచ్చని పిటిషనర్ వాదన లేవదీసినా హైకోర్టు అంగీకరించలేదు. ఎంటిపి చట్టంలోని సెక్షన్ 5 ను తక్కువ చేసే అధికారం లేదని స్పష్టం చేసింది. అంతేకాదు. ఇది చట్టం అధికా రాన్ని దౌర్జన్యంగా వినియోగించడమే అవుతుందని తీవ్రంగా హెచ్చరించింది. చివరికి గర్భిణి జీవితానికి ఎటువంటి ప్రమాదం లేదని నిర్ధారణ కావడంతో పిటిషనర్ గర్భస్రావం హక్కును కోర్టు తిరస్కరించింది. ఇదేవిధంగా 2015లో 25 నుంచి 26 వారాల పిండంతో ఉన్న 13 ఏళ్ల అత్యాచార బాధితురాలికి గర్భస్రావం చేయించుకోడానికి పంజాబ్-హర్యానా హైకోర్టు తిరస్కరించింది. వైద్య నివేదిక కూడా దీనికి ఒప్పుకోలేదు. కానీ గర్భస్రావానికి సాధ్యాసాధ్యా లను తిరిగి సమీక్షించాలని హైకోర్టు ఎయిమ్స్ డాక్టర్లను అభ్యర్థించిం ది. ఈ కేసు నడుస్తుండగా పిటిషనర్ ఆరోగ్యవంతమైన బిడ్డను ప్రసవించడంతో ఆ కేసు అంతటితో పరిష్కారం అయింది. అయితే ఎంటిపి చట్టానికి అత్యవసరమైన సవరణలు చేయాలని కేంద్ర ప్రభుత్వానికి కోర్టు సూచించింది. ఇందులో ముఖ్యమైన అంశం ఏమంటే గర్భిణి ఆరోగ్యానికి ఎలాంటి ప్రమాదం వాటిల్లకుండా ఉండడానికి డాక్టర్లు సత్సంకల్పంతో గర్భస్రావానికి నిర్ణయం తీసుకుంటే అనవసరంగా డాక్టర్లు నిందితులయ్యే పరిస్థితి రాకూడదు. ఇదే విషయమై డాక్టర్లు నేరస్తులు కారని చట్టం స్పష్టం చేయాల్సి ఉంది. దానికి సవరణ అవసరమవుతుంది. పిండం 12 నుంచి 20 వారాల వయసులో ఉంటే గర్భస్రావా నికి ఇద్దరు మెడికల్ ప్రాక్టిషనర్ల అనుమతి తప్పనిసరి అవుతుంది. అలాగే అనేక లోపాలతో అవలక్ష ణాలతో బిడ్డ పుడతాడనుకుంటే గర్భస్రావానికి చట్టం అనుమతిస్తుం ది. అయితే అటువంటిబిడ్డ ఉన్నప్పుడు గర్భస్రావం చేయించుకోవడం గర్భిణి హక్కు అని చట్టం ఎక్కడా పేర్కొనలేదు.

ప్రస్తుతం అమలులో ఉన్న ఎంటిపి చట్టం కూడా గర్భిణి అభ్యర్థనపై గర్భస్రావానికి అనుమతించే అవకాశం లేదు. వీటన్నిటికి నేపథ్యం ఆడ శిశువులను సమూలంగా నిర్మూలించే అంటే భ్రూణ హత్యలను నివారించడానికి, తగ్గించడానికే ఎంటిపి అవతరించింది. 1994లో ప్రి నాటల్ డయాగ్నస్టిక్ టెక్నిక్స్ (రెగ్యులేషన్ అండ్ మిస్‌యూజ్) చట్టం వెలుగులోకి వచ్చిన తరువాత లింగనిర్ధారణ పరీక్షచేయడం కఠిన నేరంగా పరిగణించబడింది. ఈ పరీక్ష చేయిం చుకున్నా, చేసినా కఠినశిక్ష తప్పదు. గర్భస్థ శిశువును తొలగించే పరిస్థితి ఎదురైనప్పుడు చట్టపరమైన అంశాలపై వివాదాలు, సంఘర్ష ణలు తలెత్తుతుంటాయి. ఇదే సందర్భంలో మహిళలు తమ శరీరంపై ఉన్న హక్కును కూడా ముఖ్యంగా పరిగణనలోకి తీసుకోవాలి. కానీ అది ప్రస్తుత చట్టాల్లో పరిమితమైంది.

బాలికలు  తమ కుటుంబాలనుంచి దూరంగా బహిష్కరింపబడుతున్నారు. సాంఘికంగా వెలివేయబడతా మన్న భయం చాలామందిని తెగింపుకు పురికొల్పుతుంది. దేశం లోని గ్రామీణ ప్రాంతాలన్నిటా ఇదే కనిపిస్తుంది. ఢిల్లీకి సమీపాన గల గుర్‌గావ్‌లో ప్రభుత్వ ఆసుపత్రుల్లో గర్భస్రావాలను  కోరే కౌమార బాలికల కేసుల సంఖ్య విపరీతంగా పెరగడం నిత్యదృశ్యమవుతోంది. ప్రభుత్వ వైద్య నిపుణులు అవాంఛనీయ గర్భాలు రాకుండా గర్భ నిరోధక సాధనాలను ప్రోత్సహిస్తున్నారు. కానీ గ్రామీణ ప్రాంతాల్లో ఇవి అంతంతమాత్రంగానే లభించడంలేదు. యువతులు లేదా యువకులు ఈ సాధనాలను నేరుగా అడగడానికి మొహమాట పడుతుంటారు.  సెక్స్ ఎడ్యుకేషన్ లోపించడమే దీనికి కారణం. ఎక్కువమంది భారతీయ యువకులు మొదటిసారి లైంగిక క్రీడలో పాల్గొన్నపుడు గర్భనిరోధానికి కావలసిన రక్షణవిధానం ఏదీ ఉపయోగించరు. సాధారణంగా గర్భనిరోధానికి సంబంధించి కండోమ్, ఐయుడి వంటివి తెలిసినా వాటికి దూరంగా ఉంటున్నారు. యువతులకు ట్యుబెక్టమీ, యువకులకు వెసక్టమీ శస్త్రచికిత్సలు అమలులో ఉన్నప్పటికీ  సరిగ్గా పాటించరు. పెళ్లయినవారు కూడా దీనికి సిగ్గుపడుతుంటారు. ఇదే సమయంలో ఇతర దేశాల్లో ఈ విధానాలు వేగంగా విస్తరిస్తున్నాయి. లైంగిక విధానాలు మారుతున్నాయి. పెళ్లికిముందు లైంగిక క్రీడలు పెరుగుతున్నాయి. గర్భనియంత్రణ సమాచారంలోపించడం, సామాజిక పరిస్థితులు, అవాంఛనీయ గర్భధారణ, గర్భస్రావానికి ప్రేరణ.. ఇవన్నీ తప్పని ఫలితాలుగా మిగులుతున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా యువతకు కావలసిన గర్భ నియంత్రణ సాధనాలు లభించడంలేదు. తప్పనిసరి పరిస్థితుల్లో కుటుంబ నియంత్రణే శరణ్యమవుతోంది. 2012లో 900 మిలియన్ మంది చేయించుకుంటే 2015 నాటికి 962 మిలియన్‌కు సంఖ్య పెరిగింది. వర్ధమాన దేశాల్లో ఇది కనిపిస్తోంది. వర్ధమాన దేశాల్లో గర్భ నియంత్రణ సాధనాల వల్లనే 2,72,000 మంది తల్లులుకాకుండా బయట పడగలిగారని ఒక అధ్యయనం వెల్లడించింది. కానీ ప్రపంచం మొత్తంలో భారత దేశం గర్భిణుల మరణాల స్థావరంగా చరిత్రకెక్కు తోంది. ఈ మరణాల్లో 50శాతం 19 నుంచి 24 ఏళ్లలోపు  బాలికలు కావడం శోచనీయం. ఈ వివరాలను బట్టి సెక్స్ ఎడ్యుకేషన్‌పై గర్భనియంత్రణపై అవగాహన లోపించడం, ఆరోగ్య భద్రతకు తక్కువ ఖర్చు చేయడం అనేక అనర్థాలకు దారితీస్తోంది.



## ఎంటిపి చట్ట రక్షణ ఎంతవరకు?

చట్టప్రకారం 20 నుంచి 24 వారాల గర్భిణి గర్భస్రావం చేయించుకోవడానికి అవకాశం లేదా? అదే సమయంలో తప్పనిసరిగా గర్భస్రావం చేయించుకోవలసిన పరిస్థితి ఎదురైతే ఏంచేయాలి? అన్న అంశాలు గత కొన్నేళ్లుగా చర్చనీయాంశం అవుతున్నాయి. మెడికల్ టెర్మినేషన్ ఆఫ్ ప్రెగ్నన్సీ యాక్ట్ 1971 (ఎటిపి) ప్రకారం 20 వారాలకు మించి గర్భాన్ని మోస్తున్న గర్భిణి గర్భస్రావం చేయించుకోకూడదు. అలా చేయించుకుంటే దానికి బాధ్యులైన వారంతా నేరస్తులవుతారు. గర్భిణికి తన శారీరక క్షేమంపై నిర్ణయం తీసుకునే హక్కు ఉన్నప్పటికీ చట్టం వల్ల ఆ హక్కుకు స్వేచ్ఛ లభించడం లేదు. ఈ నిర్ణయంలో జాప్యం జరిగి గర్భిణి ప్రాణానికే మృత్యుగండం ఏర్పడితే ఎవరు బాధ్యులు? అందుకే ఈ చట్టానికి సవరణలు అవసరమని వివిధ వర్గాల నుంచి అభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి. కొన్ని సవరణల ప్రతిపాదనలతో నమూనా చట్టం తయారైంది. దీనిపై కేంద్ర ఆరోగ్యశాఖ సూచనలను ఆహ్వానిస్తోంది. ఈవిధంగా ఈ చట్టం ప్రతిపాదనల సవరణలపై కసరత్తు జరుగుతుండగా మరోవైపు కొంతమంది గర్భిణులు తమకు 20 వారాలు దాటినా గర్భస్రావానికి వీలు కల్పించాలని సుప్రీంకోర్టుకు పిటిషన్లు దాఖలు చేస్తున్నారు. మళ్లీ ఇటీవల నికిత అనే 14 ఏళ్ల అత్యాచార బాధితు రాలు తాను గర్భం దాల్చి 20 వారాలు దాటిందని, ఈ అనైతిక గర్భంతో ప్రసవించడం తనకు ఇష్టంలేదని, తక్షణం గర్భస్రావానికి అనుమతించాలని కొన్ని ఆధారాలను చూపిస్తూ సుప్రీంకోర్టుకు పిటిషన్ దాఖలు చేసింది. దీన్ని స్పెషల్ కేసుగా పరిగణించి గర్భస్రావానికి సుప్రీంకోర్టు అంగీకరించింది. దీంతో ఈ 'గర్భస్రావ' సమస్య మళ్లీ చర్చకు దారితీసింది. నికిత కేసులో సుప్రీంకోర్టుఇచ్చిన తీర్పును పూర్వ ప్రమాణంగా ముమ్ముందు ఉపయోగించుకుని 20 వారాలు దాటిన గర్భిణులెవరైనా తాము కోరుకున్న ప్రకారం గర్భస్రావాలు చేయించుకోవడానికి వీలులేదు.

కొన్ని సవరణల ప్రతిపాదనలతో తయారైన నమూనా చట్టం ప్రకారం గర్భిణి తనకు అత్యాచారం వల్ల గర్భం వచ్చిందని, తన గర్భస్థ పిండానికి ప్రమాదం పొంచి ఉందని రుజువుచేసినప్పటికీ ఆరోగ్య సంరక్షకుడైన డాక్టరు పూర్తి హామీపైనే 20 నుంచి 24 వారాల వ్యవధిలో గర్భస్రావం చేయించుకోవడానికి వీలవుతుంది. అయితే దీనికి తగ్గట్టు చట్టాన్ని సవరించాల్సిన విధానం గతకొన్నేళ్లుగా నీళ్ల నములుతోంది. మరోపక్క గర్భస్రావ కేసులసంఖ్య పెరిగిపోతున్నాయి. ఎంటిపి చట్టం అమలులోకి వచ్చి దాదాపు నాలుగు దశాబ్దాలు గడిచాయి. ఈ లోగా గర్భస్థ శిశువు లింగనిర్ధారణ, ఆరోగ్యపరిస్థితి, ఇతర లక్షణాలను సూక్ష్మంగా కనుగొనగలిగే అత్యంత ఆధునికవిజ్ఞానం అందుబాటులోకి వచ్చింది. అల్ట్రాసౌండ్, మేగ్నెటిక్ రిసొనాన్స్ ఇమేజింగ్ (ఎంఆర్ఐ), పిండాన్ని పర్యవేక్షించే సాధనాలు, శిశువు ఆరోగ్యాన్ని ముందుగానే కచ్చితంగా కనుగొనగలిగే విధానాలు ఇప్పుడు బాగా సమకూరాయి. అయినాసరే, పాతకాలం పద్ధతులు, చాటుమాటు శస్త్రచికిత్సలు, అర్హతలేని నాటువైద్యుల పర్యవేక్షణలు గర్భిణి పాలిట శాపాలుగా వెంటాడుతున్నాయి.  ఈ సమస్యలను అధిగమించాలంటే ఎంటిపి చట్టానికి సవరణలు తప్పనిసరి అవుతోంది. ఆయుర్వేద, యునాని, సిద్ధ తదితర వైద్య విధానాల శిక్షకులను గర్భస్రావాలను చేయడానికి అనుమతించేలా కొత్తగా ప్రతిపాదనలు తీసుకొచ్చారు. అయితే వీరు కేవలం మందుల ద్వారానే గర్భస్రావం చేయాలి తప్ప శస్త్రచికిత్సలు చేయడానికి వీలులేదు. అంటే దీని అర్థం కొద్దిమార్పులతో తిరిగి రిజిస్టర్డు మెడికల్ ప్రాక్టిషనర్లు కచ్చితంగా ఉండాలన్న అభిప్రాయమే వెల్లడవుతోంది. చట్టప్రకారం గర్భస్రావం చేయించడానికి గర్భ వ్యవధిని నిబంధనల ప్రకారం పెంచడం తల్లీబిడ్డల ఆరోగ్య పరిరక్షణకే అన్నది ఇక్కడ ప్రశ్నకాదు. గర్భస్రావానికి తగిన పరిశుభ్ర వాతావరణ నిర్వహణ వ్యవస్థ, అర్హులయిన డాక్టర్ల పర్యవేక్షణ, ఆరోగ్య భద్రత ఇవన్నీ గర్భస్రావ సమయంలోనే కాదు తరువాత కూడా  సమకూర్చవలసి ఉంటుంది. గర్భస్రావానికి అదుపుకోసం 20 వారాల గడువు ఉన్నప్పటికీ దాన్ని అతిక్రమించి ఎవరికీ తెలియకుండా రహస్యంగా గర్భస్రావాలు సాగిపోతున్నాయి. చివరికి  తల్లుల ఉసురు పోసుకుంటున్నాయి. కొత్తప్రతిపాదనల్లో కేవలం గర్భిణి శారీరక ఆరోగ్యాన్ని దృష్టిలోపెట్టుకుని ప్రసవించాలా లేక నిరోధించాలా అన్న నిర్ణయం యాంత్రికం కారాదన్న అభిప్రాయానికి ఏకాభిప్రాయం కుదిరింది. అలాగే అత్యాచారఫలితంగా సంక్రమించిన గర్భభారం గర్భిణి  తీవ్ర మనోవేదనకు నరకయాతనకు దారితీయకూడదన్న అంశం కూడా ప్రతిపాదనల్లో చోటుచేసుకుంది. ఇవన్నీ నికిత కేసులో సుప్రీంకోర్టు తీర్పును ప్రభావితం చేశాయి. ప్రేమపేరుతో వంచింపబడి గర్భం దాల్చిన యువతులు కొందరు పరువుపోతుందనే భయంతో తమ అంకురాన్ని నిర్మూలించుకోడానికి ఆరాటపడే సంఘటనలు ఇటీవల జరుగుతున్నాయి. ఖమ్మంజిల్లా మణుగూరు సమితి సింగారానికి చెందిన 22 ఏళ్ల అవివాహిత గర్భిణి అయింది. తాను హైదరాబాద్ గచ్చిబౌలి లోని కాకతీయ ఆసుపత్రిలో ల్యాబ్ టెక్నీషియన్‌గా పనిచేస్తున్నా తన గర్భం బయటపడకుండా మసలగలిగింది. అయితే అర్ధరాత్రి సమయం లో ప్రసవించిన బిడ్డను పరువుకు భయపడి చంపివేసింది. ఇటువంటి దర్ఘటనలను దృష్టిలో పెట్టుకుని అటువంటి వాళ్ళ ఇలాంటి తెగింపు లకు పాల్పడకుండా ఉండాలంటే గర్భస్రావం విషయంలో గర్భిణి నిర్ణయం తీసుకునే స్వేచ్ఛ ఉండడం అవసరం. ఎంటిపి చట్ట సవరణ ప్రతిపాదనల్లో ఈ విధమైన అంశాలకు చోటు కల్పించి గర్భిణికి రక్షణ కల్పించవలసిన అవసరం ఉంది.

# స్ఫూర్తినిచ్చే జీ'వన'యానం!

జీవితంలో అందునా రిటైర్‌మెంట్ అయ్యాక చాలామంది కాలాన్ని ఏ లక్ష్యమూ లేకుండా గడిపేస్తుంటారు. పైగా 'జీవితమంతా కష్టపడ్డాం. ఇప్పుడు విశ్రాంతిగా గడపటంలో తప్పేముంది' అంటుంటారు. కానీ కుసుమ్ దహీ వల్కర్ అలా కాదు. ఆరుపదులు దాటిన ఆమె తన జీవితాన్ని చెట్ల పెంపకానికే వెచ్చిస్తోంది. గతంలో ఆమె నాసిక్ (మహారాష్ట్ర)లో అటవీశాఖలో ప్లాంటేషన్ ఆఫీసర్‌గా పనిచేశారు. మొక్కల్ని సంరక్షించాలని, కొత్త చెట్లను నాటాలని ఆమె చెప్పటం కాదు, చేసి చూపించి స్ఫూర్తి దాయకంగా నిలిచారు. ఎన్నో ఏళ్లపాటు ఆమె వెళ్లటానికి అసాధ్యంగా ఉండే అటవీ ప్రాంతాలకు వెళ్లేవారు.

వ్యవసాయకళాశాలలకు చెందిన టీచర్లతో, వృక్ష శాస్త్రవేత్తలతో అనేక విషయాలు చర్చించేవారు. అడవుల్లో నివసించే గిరిజనులను కలిసి వారి సాధకబాధకాలను తెలుసుకునేవారు.

ఉద్యోగంలో ఉన్నరోజుల్లో ప్రతి వర్క్‌షాప్‌కు, లెక్చర్లకు, సభలకు హాజరయి చెట్ల గురించి అనేకానేక విషయాలు తెలుసుకునేవారు. ఇతరులు ఈమెను చూసి 'జీవితమంతా మొక్కల పరిశోధనలో గడుపుతోంది. వెర్రి'అనుకునేవారు. కానీ నేను మొక్కలమీద చెప్పలేని మక్కువ ఉండటంతో ఎవరి మాటలను పట్టించుకోలేదు' అంటుంది కుసుమ్. అసలు బాల్యంనుంచే ఆమెకు మొక్కలంటే ఎంతో ఇష్టంగా, ఆసక్తిగా ఉండేది. గుజరాత్, మహారాష్ట్ర సరిహద్దుల్లో ఉన్న నిజార్ గ్రామం వారిది. ఆయుర్వేద పండితుల ఇంట్లో పుట్టటంతో సహజంగానే వనాలు, వనమూలికల మీద ఆసక్తి కలిగింది. మొక్కలు, వేర్లు,పూలు ..వగైరాల గురించి ఆమె తన తాతగారిని, తండ్రిని అడిగి తెలుసుకునేది.

మొక్కల పట్ల ఆమె అంకితభావం ఎంతటిదంటే తనకొచ్చిన గ్రాట్యూటీ, ప్రావిడెంట్ ఫండ్‌లనుంచి డబ్బును ఖర్చుపెట్టి నాసిక్ పొలిమేరల్లో అర ఎకరం భూమి కొన్నది.

ఇప్పుడు ఆమె హిర్వేపుణ్య ఇన్‌స్టిట్యూట్‌ను నడుపుతోంది. అందుకు రెండు అంతస్థుల అపార్ట్‌మెంట్‌ను కట్టించింది. అందులో 50మందికి పైగా పట్టేలాగా ఒక కాన్ఫరెన్స్ రూమ్‌ను ఏర్పాటుచేసుకుంది. అక్కడే ఆమె వర్క్‌షాప్‌లను సైతం నిర్వహిస్తోంది. ఆ ఇంటి చుట్టూ ఖాళీస్థలంలో నర్సరీ ఏర్పాటు చేసుకుంది. అందులో 2000కుపైగా అనేక రకాల ఔషధ మొక్కలున్నాయి. దేశంలోని వివిధ





ప్రాంతాలనుండి విలువైన ఔషధ మొక్కలను సేకరించి తన ఇంట్లో పెంచుతోంది. చాలా మంది ఆమెను నిరుత్సాహపరిచినా ఆమె తన ఆకాంక్ష మేరకు నర్సరీని ఏర్పాటు చేసింది. చిన్నప్పుడే అమ్మానాన్నలను కోల్పోయిన మేనల్లుడు చిరంతన్ పరేఖ్‌ను, కుసుమ్ తాయ్ పెంచి పెద్దచేసింది. ఇప్పుడు ఇన్‌స్టిట్యూట్‌ను పరేఖ్ సహకారంతో నడుపుతోంది.

ఎలక్ట్రానిక్స్ అండ్ టెలికమ్యూనికేషన్స్ ఇంజనీర్ అయిన చిరంతన్ పరేఖ్ క్రమంగా కుసుమ్ చేస్తోన్న పనిపట్ల ఆకర్షితుడై తన ఉద్యోగాన్ని వీడి కుసుమ్‌తో పాటు పని చేయడం ఆరంభించాడు. వర్క్‌షాపుల్లో కుసుమ్ చెప్పే విజ్ఞానదాయక అంశాలు విని ఎందరో ఉత్తేజితులవుతున్నారు, ప్రయోజనం పొందుతున్నారు, వారూ మొక్కల ప్రేమికులుగా మారుతున్నారు.

ఆమె నర్సరీలోని వందకు పైగా ఔషధ మొక్కలు, వివిధ రకాల అనారోగ్యాలను నయంచేసేవని చెపుతారామె. తమ ఇన్‌స్టిట్యూట్‌లో మూడు రోజుల పాటు ఫుల్‌టైమ్ కోర్సు నందిస్తున్నామని, నిరంత రాయంగా మూడురోజులపాటు కూర్చోలేమను కునేవారికి రోజుకు ఒకటి లేదా రెండు గంటల పాటు క్లాసులు 15రోజుల పాటు తీసుకుంటామని, ఈ వర్క్‌షాప్‌కు హాజరయ్యే వారికి ఫీజు రూ.3,500 ఉంటుందని వివరించాడు చిరంతన్.

అనేకమంది పర్యావరణవేత్తల మాదిరిగానే కుసుమ్ తాయ్ కూడాఅభివృద్ధి పేరిట చెట్లను విచక్షణారహితంగా కూల్చడాన్ని నిరసిస్తుంది. వాటికి బదులుగా త్వరగా ఎదిగే గుల్‌మొహర్, సుబాబుల్ లేదా యూకలిప్టస్‌ను పెట్టడం కూడా ఆమెకు అంతగా నచ్చదు. ఎందుకంటే ఎకో సిస్టమ్‌కు అవి పెద్దగా ప్రయోజనకారులు కావంటారామె.

దేశీయ మొక్కలు ఎన్నో దశాబ్దాలుగా.. శతాబ్దాలుగా ఉన్నాయి. వాటి విత్తనాలు మొలకెత్తటానికి కనీసం 6 నుంచి 18 నెలలు కాలం పడుతుంది. ఆతర్వాత నిడుపాటి చెట్లుగా ఎదగటానికి సంవత్సరాలు పడుతుంది. నిర్మాణాలేవైనా పక్షులకు, జంతువులకు, కీటకాలకు హానికరం కాని రీతిలో ఉండాలి. కిచెన్ గార్డెన్, రోజ్ గార్డెన్, ఆర్చిడ్ గార్డెన్, స్పైస్ గార్డెన్..ఇలా వేర్వేరు రకాల మొక్కల్ని పెంచడం వల్ల సందర్శకులకు ఒకే చోట అన్ని రకాల మొక్కలను చూసేందుకు వీలుంటుందంటారు కుసుమ్. దేశీయ మొక్కల్ని నిర్లక్ష్యం చేయడం వల్ల భూగ్రహం పెద్ద ప్రమాదంలో పడుతుందని, అందువల్ల ఈ విషయమై అందరూ జాగ్రతితో ఉండాలంటూ, మహాత్మాగాంధీ చెప్పినట్లు.. "ప్రపంచంలో అడవులకోసం మనం ఏంచేస్తున్నామో అది మనకోసం, ఒకరికోసం ఒకరు చేసుకున్నదే అవుతుంది. అడవులకోసం చేసే కృషి మనకోసం చేసుకునే కృషికి అద్దం పడుతుంది' అంటారు కుసుమ్ తాయ్.

వయసుతో నిమిత్తం లేకుండా పర్యావరణం కోసం పాటుపడుతున్న కుసుమ్ తాయ్ నిజంగా అభినందనీయురాలు. ■

## కృతి

# గుండెల్లోకి దూసుకుపోయే కవిత్వం



తస్సల కూర, మట్టిసోల్తి, మెతుకుల తలె, సోలు పోత, మజ్జెతి..యివి పొన్నాల బాలయ్య కొన్ని కవితా శీర్షికలు. యిక ఆయన కవిత్వం వెదజల్లిన తెలంగాణ భాషాపరిమళాలు ఆస్వాదించాలంటే కవిత్వ పొత్తం 'మిగ్గు' తెరవాల్సిందే. చర్మకారుడు ఉపయోగించే ఓ పరికరం 'ఆరె'కు త్వరగా, వేగంగా, సులభంగా దిగబడిపోయే గుణానిచ్చే.. కొమ్ములో నిల్వఉంచిన గొడ్డు కొవ్వును 'మిగ్గు' అంటారు. అంటే ఒక ల్యూబ్రికెంట్ అన్నమాట. అలాగే ఈ కవి అట్టడగు సామాజికవర్గాల జీవన సంఘర్షణని తన అక్షరాల్తో రగులుస్తూ, కవిత్వంలో ముంచి మనకందిస్తున్నాడు. తరతరాలుగా వివక్షకు గురై, దోపిడికి బలై, అస్తిత్వానికి దూరమై, అలమటిస్తున్న మనుషుల ప్రతినిధిగా తన కలాన్ని ఝళిపిస్తున్నాడు.. "ఉమ్మడి రిజర్వేషన్ల జ్యేష్ట పాలు పొందితే పొందితివి/ పిడికెడన్నం తలా మెతుకు పంచుకుని తిందామంటే తప్పేంది?" అంటూ తన వారిపై ఉరుముతున్నాడు. ప్రక్షాళన ఎక్కడ మొదలవ్వాలో తెలిసిన కవి. "ఎండిన చెరువును జూత్తె గుండె పల్గందెవ్వరికి?" అలా గుండెలు పగిలి రాలుతున్న రైతులకు అయిరానపడి ఆగం గావద్దు/ జిమ్మను ఒక్కసితం జేసు కుంటే రేపటికుదార్థం" అంటూ ధైర్యవచనాలు పలుకుతాడు. "జీవిత మంటే యుద్ధమే/ యుద్ధమంటే జీవితమే..అని సమరం సాగిస్తూ అ తరాలు నూరుకొని యుద్ధవీరునౌతున్న కొత్తచూపుతో" అంటోన్న యువకవి పొన్నాల బాలయ్య.

**(మిగ్గు-కవిత్వం: పొన్నాల బాలయ్య; వెల: రూ. 100;ప్రతులకు:ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-రమణ వెలమకన్ని

# ఈ కథలు సహజ సుందరాలు..



పల్లెలు.. ఆత్మీయతానుబంధాలతో కూడిన పల్లె జీవనం, ఆచారాలు, సంప్రదాయాలు, మనుషులు.. మనస్తత్వాలు, మానవత్వం, రాజకీయాలు, సమాజంలో దోపిడీ...ఇవన్నీ ఎంతో సహజంగా తన కథల్లో ఇమిడ్చి, పాఠకులను ఆ కథల్లో లీనమయ్యేంత శక్తిమంతంగా రాసే రచయిత కూతురు రాంరెడ్డి. 'బతుకమ్మ' పేరిట ఆయన వెలువరించిన 18 కథల సంకలనంలో కథలన్నీ గతంలో వివిధపత్రికల్లో ప్రచురితమై ప్రాచుర్యం పొందినవే. తొలికథ 'బతుకమ్మ' ఎంతో వైవిధ్యంగా ఉంది. బతుకమ్మ పండుగ జరుపుకోవడం నేపథ్యంలో హిందూ, ముస్లిమ్ ఐక్యతను, అభేద భావాన్ని సందేశంగా ఇవ్వడం ఎంతో ప్రశంసనీయం. తెలంగాణ ఉద్యమ కాలంలో అదే వస్తువుగా రాసిన 'పోరు బాట' కథ మనసుకు హత్తుకునేలా ఉంది. 'నిరీక్షణ' కథలో లక్ష్మమ్మ కొడుకు తండ్రి కోరికను నిజంచేస్తూ మిలట్రీలో చేరడం.. ఆతర్వాత సరిహద్దుల్లో శత్రువులను చీల్చిచెండాడటం, చివరకు కాలు, చెయ్యి కోల్పోయి ఇల్లు చేరటం.. కథనిండా దేశభక్తి. పచ్చని చెట్లు పర్యావరణానికి ప్రాణమని సందేశమిచ్చే 'హరిత ఛత్రం' కథ చక్కగా ఉంది. స్నేహబంధానికి అద్దంపట్టే కథ 'డాటరాఫ్ ప్లవంగాచారి'. ఇలా ఒకటేమిటి, ఇందులోని ప్రతికథ దేనికదే ప్రత్యేకంగా ఉంది.

**(బతుకమ్మ- కథల సంపుటి:కూతురు రాంరెడ్డి; వెల:రూ.120; ప్రతులకు: కూతురు రాంరెడ్డి, ప్లాట్ నం.11, ఇంటి నం. 6- 67, సుప్రభాత్ II, కచవాని సింగారం, ఘట్‌కేసర్ మండల్, మేడ్చల్ జిల్లా-హైదరాబాద్-500088)**

-జె.శ్యామల

# మనోవీధుల్లో జీవితాన్వేషణ



అనుభవాలను తరచి తరచి ఉద్వేగాలకు లోనవుతూ, నిజాయితీగా అక్షరబద్ధం చేసిన దాసరి శిరీష కథలివి. గతంలో పలు పత్రికల్లో ప్రచురితమైన ఈ కథలను 'మనోవీధి' పేరుతో మన ముందుకు తెచ్చారు రచయిత్రి. మనిషికి, మనిషికి మధ్య ఆర్థిక సంబంధాలు సృష్టించే అడ్డుగోడలు- ఆ గోడలు ఛేదించుకుని రాలేని ఉన్నత కుటుంబీకుల మనస్తత్వాలు.. సమాజంలోని అట్టడుగువారి వల్ల ప్రయోజనం పొందుతూనే, ఆదుకోకుండా, వారిని దూరం ఉంచే స్వభావాలు.. ఎదురవుతున్న చిన్న చిన్న ఆనందాల్ని పక్కకు నెట్టి ఎక్కడో దూరాన్వేషణలు, మనుషుల మధ్య ఆత్మీయత పెంపొందించే నూతన జవసత్వాలు.. ఇవన్నీ పాఠకుడిని ఉద్విగ్నతకు లోనుచేస్తాయి. రిక్షాలాగి బతుకీడ్చే కేశవులైనా, సంపన్నుడైనా, తమ పిల్లలకు మంచి చదువు ఇవ్వాలని ఆరాటపడతారు. విధి నిర్వహణలో తమ ప్రాణాలొడ్డటానికి కూడా వెనుకాడరు. వీరి యజమానులు వీరిని ఆమడదూరం ఉంచి అందని ద్రాక్షను చూపుతూ పబ్బం గడుపుకుంటారు...అని చెప్పే 'సరిహద్దులు' కథ. 'జీవితం ఎంతో విలువైనది, బతకటం నేర్చుకోవాలి కాని నీరసపడితే లాభంలేదు' అని చెప్పే 'జీవితమంటే' కథ. 'పిల్లలు లేతకొమ్మల్లాంటి వారు. వారిని ఎలాపెంచితే అలా తయారవుతారు, వారిని సరైన మార్గంలో పెట్టటం సంరక్షకుల బాధ్యత' అని గుర్తుచేసే 'ఈ దేశంలో ఒక తల్లి..' ఇలా ఇందులోని ప్రతి కథ ప్రబోధాత్మకమే.

**(మనోవీధి-కథలు:దాసరి శిరీష, వెల:రూ. 100; ప్రతులకు:అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం

# మానవత అద్దుకున్న కవితలు



కవితలన్నిటా మానవత, మానవీయ కోణాల్ని ఆవిష్కరింపజేసే మోయిగారి రఘుపతి 'ఆశాజీవి' పేరిట ఓ కవితాసంపుటిని వెలువరించారు. అయితే వస్తువుకు ప్రాధాన్యతనిచ్చిన ఈకవి శిల్పంపై మరింత శ్రద్ధపెట్టాల్సిన అవసరం ఎంతైనా ఉంది. కవితలు కవి హృదయ సంవేదనలకు అద్దంపట్టాయి. ప్రతి కవిత పక్కన బొమ్మలు వేయడం పుస్తకానికి నిండుతనం ఇచ్చింది. నా మదిలో కదిలే భావాలను/ కలంతో కాగితంపై ఒడిసి పట్టాలని/ కాగితంపై నడిపే ప్రయత్నంతో/ మనిషి ఆశాజీవి" కాదా?" అంటారు 'ఆశాజీవి' అనే కవితలో.

అలాగే 'వెన్నెల' కవితలో చివరి వాక్యాలు..ఆలోచింపజేస్తాయి. మా ముద్దుల చిన్నారి పాప పేరే వెన్నెల/ అందుకే మాకు ప్రతిరోజు వెన్నెల/ఆ వెన్నెల నింగిపైనుంచి మా పెరట్లో / మా వెన్నెల నేలపైన మా ఇంట్లో..అంటారు కవి.

తన ఊరు గురించి రాసిన ఓమంచి కవిత 'మారింది మా ఊరు' జన్మనిచ్చింది అమ్మ అయితే/ బతుకునిచ్చింది మా ఊరు/ పుట్టి పెరిగింది మా ఊరు/ పురిటిగడ్డ మా ఊరు/ పుడమి తల్లి చిన్న పల్లెటూరు/ మా ఊరు/ ఎటుచూచినా పచ్చని చెట్ల పంటపొలాలు/ ఇంటినిండా పాడిపంటల ధాన్యాలరాసులు/ చెరువు, కుంటల కిందనే కాదు మా సేద్యం..అంటారు రఘుపతి.

**(ఆశాజీవి-కవితా సంపుటి:మోయిగారి రఘుపతి; వెల: రూ.75; ప్రతులకు:ఎమ్.రఘుపతి, ఇం.నం.1-1- 73/ 7/ఎ, బుద్వేల్, రాజేంద్రనగర్, హైదరాబాద్-30)**

-తంగిరాల చక్రవర్తి




# బండకాదది..ప్రేమగుండె

కస్తూరి మురళీకృష్ణ

**సూర్యకిరణాలు తాకటంతోటే, ప్రాణంపోసుకున్నట్టు మంచుకొండలు వెండి వెలుగుతో ధగధగలాడసాగాయి. లోయలో చీకటిలో మగ్గుతున్న నల్లటి వృక్షతతులు పచ్చటి రంగులో తళతళలాడసాగాయి.**

**ఆకాశంలో స్వేచ్ఛావిహారం చేస్తున్న పక్షులు, కింద జలజల పారుతున్న 'స్కేమ్'నది నీళ్లపై ప్రతిఫలిస్తున్న సూర్యకిరణాలను చూస్తూ ఆనందంతో తాండవం చేస్తున్నట్టున్నాయి.**

**స్కేమ్ నది మధ్యలో ఓ పెద్ద బండ నిలచిఉంది. దూరం నుంచి చూస్తే ఎవరో మనిషి దేనికోసమో ఎదురుచూస్తూ నది మధ్యలో నిలచి ఉన్నాడన్న ఆపోహ కలుగుతుంది. కానీ సూర్యకిరణాల తాకిడికి సుషుప్తి నుంచి జాగృతమై, తనకు చైతన్యం కలిగించే వారికోసం ఎదురుచూస్తున్నట్టుంది ఆ బండరాయి.**

ఆ బండరాయిని తాకుతూ ప్రవహిస్తున్న నీరు, దానికి ధైర్యం చెప్తున్నట్టుంది.

ఇంతలో...

ప్రవాహానికి ఎదురు ఈదుతూ, వెండి వెలుగుతో మెరిసిపోతూ అత్యంత సుందరమైన చేప బండరాయి వైపు వస్తోంది.

ప్రవాహం దాన్ని వెనక్కు నెడుతోంది.

కానీ పదడుగులు వెనక్కు వెళ్తే ఒక అడుగు ముందుకు వేస్తూ వస్తోంది ఆ చేప.

'ఆ చేపకోసమే ఎదురు చూస్తున్నట్టు బండరాయి వదనం వికసించింది. దానిపై పడుతున్న నీటి నురుగు దాని సంతోషపూర్వకమైన చిరునవ్వు తళతళలుగా తోస్తున్నాయి.

ప్రవాహానికి ఎదురీదుతూ వెండిరంగులోని చేప బండరాయిని చేరుకుంది. బండరాయిని తాకింది.

అంటే...అంతవరకూ నిర్జీవంగా తోచిన బండరాయి చైతన్యంతో తొణికిసలాడటం ఆరంభించింది. దాని చుట్టూ సుళ్లు తిరుగుతున్న నీటి నురగలపై ప్రతిఫలించే సూర్యకిరణాల తళతళలు వెలుగు కన్నెలు ఆనందతాండవం చేస్తున్నట్టున్నాయి.

రాయిని తాకుతూ ప్రసరిస్తున్న గాలి, ప్రవహిస్తున్న నీరు కలగలసి చేస్తున్న నాదాలు అందమైన దోంబ్రా గానాన్ని తలపిస్తున్నాయి.

ఈ అత్యద్భుతమైన దృశ్యం చూసి, బండరాయికి చైతన్యాన్నిచ్చే చేప నడుమ ఉన్న అమరగాథను తలచేందుకు ప్రపంచవ్యాప్తంగా ప్రజలు సుందరమైన ఉజ్బెకిస్తాన్‌లోని 'షహజువారా' చేరుకుంటారు.

**************

నమ్మలేనట్టు తన కూతురివైపు చూశాడతడు. 'నిజమా?' మరోసారి అడిగాడు.

తల ఊపింది మీనాల్లాంటి కళ్లున్న అతడి కూతురు.

'పరదేశిని ప్రేమించావా?' మళ్లీ అడిగాడు.

'అవును. అతడు నా హృదయం దోచాడు. తన దోంబ్రా వాయిద్య గీతాలతో నన్ను అలరించాడు. అతడి గీతం వింటూంటే నేను వేరే ఏవో లోకాలలో విహరిస్తున్న భావన కలుగుతుంది. నాలో దాగున్నాయని నాకే తెలియని అత్యంత సున్నితమైన, అందమైన భావనలను అతను జాగృతం చేస్తున్నాడు. అతడు లేందే నేను బతకలేను నాన్నా' అందామె.

'చిన్న పిల్లవు. ఇంకా జీవితమే ఆరంభం కాలేదు. జీవితంలో తొలి అడుగులో తటస్థ పడినదే అత్యంత సుందరమైన దృశ్యం అని ఆగిపోతే, ప్రపంచం ఏంచూస్తావు? నీ గురించి నీకు తెలియదు. ఇది తాత్కాలిక భావన. కొన్నాళ్లు పోతే ఈ భావ తీవ్రత తగ్గుతుంది. అప్పుడు అసలు జీవితం మొదలవుతుంది. ఆవేశం, ప్రేమ కాదు. ఉత్తేజం ప్రేమకాదు. ప్రేమ అన్నది ప్రశాంత భావన. అది కొన్నేళ్ల సాంగత్యం వల్ల వ్యక్తుల నడుమ కలిగే అత్యంత మృదువైన భావన. యవ్వన ప్రథమావిర్భావంలో జనించిన ఆకర్షణ ప్రేమ కాదు' నిర్ద్వంద్వంగా అన్నాడాయన.

'నాకు అదంతా తెలియదు. కానీ అతడు లేకపోతే బతకలేనని మాత్రం తెలుసు' అందామె.

'ఒకటి గుర్తుంచుకో. ఈ ప్రపంచంలో ఒకరు లేందే బతకలేను అనటం వట్టి మూర్ఖత్వం. అది అసంభవం. ఎవరికోసం ఎవ్వరూ చావరు. ప్రతి ఒక్కరికీ భగవంతుడు ఎంత సమయం నిర్దేశిస్తాడో, అంతకాలం చచ్చినట్టు బతుకుతారు. ఎవరికోసం ఎవరూ ఏడవరు. ఎవ్వరికోసం ఎవ్వరూ చావరు. అతడు లేకపోతే బతకలేననటం మూర్ఖత్వం' అన్నాడాయన.

ఆమె మాట్లాడలేదు.

**************

'మనం పారిపోదాం. ఇదో చిన్న బావిలాంటి ప్రదేశం. ఇక్కడే ఉంటే బావిలో కప్పలా ఉన్నట్టవుతుంది. బయట విశాలమైన విశ్వం చేతులు సాచి మనకోసం ఎదురుచూస్తోంది. ఈ సంకుచితాలను వదిలేసి అనంత విశ్వంవైపు పారిపోదాం' రెండు చేతులు సాచి ఆమెను ఆహ్వానించాడు పరదేశి.

'కానీ నాన్న ఇష్టానికి వ్యతిరేకంగా ఏమీచేయలేను నేను' అందామె బేలగా కాస్సేపు మౌనంగా ఉన్న తరువాత అతడు ఆమెను బుజ్జగిస్తూ చెప్పాడు.

'ఈ ప్రపంచంలో ఏదైనా పొందాలంటే, ఇంకేదైనా వదులుకోవాలి. ఏదీ వదులుకోకపోతే ఏదీ పొందలేము. మనం కలసి జీవించాలనుకుంటే మనం ఈ ప్రాంతం వదులుకోవాలి. నువ్వు మీ అమ్మానాన్నలను వదలి రావాలి. ఒకటి గుర్తుంచుకో...దేన్నయినా పట్టుకుని వేలాడటంలో గొప్పలేదు. వదల్చుకుని ముందుకు సాగటంలోనే జీవితం అభివృద్ధి చెందుతుంది'.

అతడి మాటలు ఆమెకు నచ్చినట్టులేవు.

'నాకు నువ్వంటే ప్రాణం. నీకు నేనంటే ప్రాణం. మనం కలసి ఉంటేనే మన ప్రేమ ఫలవంతమైనట్టా? మనం ఇలాగే జీవితాంతం గడపలేమా? నేను మానాన్న దగ్గరే ఉంటాను. నువ్వు మా ఊళ్లోనే ఉండు. ఇలా కలుస్తూనే ఉందాం. అప్పుడు నాన్న సంతోషిస్తాడు. మనం సంతృప్తిగా ఉండవచ్చు' అందామె అమాయకంగా.

అతడు తల అడ్డంగా ఊపాడు.

'నువ్వు అమాయకురాలివి. నీకు లోకంరీతి తెలియదు. ఇక్కడ సమాజాలు నియమాల ప్రకారం నడుస్తాయి. ప్రతి సమాజానికీ దానికి ప్రత్యేకమయిన నియమం ఉంది. అలాగే మీ సమాజానికి కొన్ని నియమాలున్నాయి. మీ సమాజంలో పిల్లలు తల్లిదండ్రుల

మాట జవదాటకూడదు. వివాహం  వారి అనుమతితోటే సాగాలి. ఇవన్నీ వ్యక్తిత్వాన్ని హరించే నియమాలు. ఈ నియమాల ఆధారంగా మీ సమాజం ప్రశాంతంగా సాగుతోంది. కానీ వ్యక్తి నిబంధనల సంకెళ్లలో ఇరుక్కుని అశాంతిపాలవుతున్నాడు. ఆ సంకెళ్లు తుంచెయ్. స్వేచ్ఛను, ఆనందాన్ని అనుభవిస్తావు' అన్నాడతడు.

ఆమె అతడివైపు ప్రేమగా చూసింది.

'మా నిబంధనలు పరదేశివయిన నీకు వింతగా అనిపించవచ్చు. అనాగరికంగా అనిపించవచ్చు. కానీ సమాజంకోసం వ్యక్తి తన స్వేచ్ఛను త్యాగం చేయటంలో మానవత్వంఉందా? తన స్వేచ్ఛకోసం సమాజాన్ని తృణీకరించటంలో అసలు వ్యక్తిత్వం ఉందా?' సూటిగా అడిగింది.

అతడు చాలాసేపు మాట్లాడలేదు. చివరికి ఆలోచనలను కూడదీసుకుంటూ అన్నాడు.

'నువ్వు పుట్టి పెరిగిన సామాజిక నియమాలు మీకు సమంజసం అనిపించటంలో ఆశ్చర్యంలేదు. కానీ పరదేశినైన నాకు మీవి బంధనాలు లాగ, వ్యక్తిత్వాన్ని హరించే నియమాలుగా అనిపించటంలోనూ అసమంజసంలేదు. కానీ మనం గీచిన గిరి దాటకపోతే ఏకమవటం కుదరదు. జీవితాంతం ఇలా నేను ఆ దరిని, నీవు ఈ దరిని నిలచి ఉంటాము. కాబట్టి నియమభంగం చేయక తప్పదు. అందరినీ వదలి నువ్వు నాతో రాక తప్పదు' నిశ్చయంగా అన్నాడతడు.

ఆమె సమాధానం ఇచ్చేందుకు నోరు తెరచింది. కానీ ఆమె సమాధానం ఇచ్చేలోగా గుర్రపు పదఘట్టనలు వినిపించాయి.

ఇద్దరూ ఆవైపు చూశారు.

'ఇక్కడున్నావా నువ్వు? మీ నాన్న నీకోసం ఎదురుచూస్తున్నాడు. అంతా వెతుకుతున్నాడు' అశ్వికుడు అరిచాడు.

'ఎందుకు?' అడిగిందామె.

'శత్రురాజు పెద్ద సైన్యంతో దండయాత్రకు వస్తున్నాడు. ఆయుధాల తయారీ కావాలట. పెద్ద ఎత్తున వేగంగా కావాలి. మీ నాన్న నీ సహాయం కోసం చూస్తున్నాడు. త్వరగా రా' గుర్రంపైన వెళ్లాదం' అన్నాడా అశ్వికుడు.

అతడు పరదేశీవైపు కూడా చూడలేదు.

ఆమె పరదేశీవైపు చూసింది.

అతడి కళ్లు ఆమెని బతిమిలాడుతున్నాయి. 'వెళ్లకు. నాతో ఊరు వదలి వచ్చెయ్యి. నువ్వు ఊళ్లోకి వెళ్తే తిరిగి రాలేవు. యుద్ధం వస్తే పరదేశీవని నన్ను ఊళ్లోకి రానివ్వరు. మళ్లీ యుద్ధం పూర్తయ్యేదాకా మనం కలవలేం' అన్నాడతడు.

'తప్పదు. వెళ్లాలి. మా సమాజంలో వ్యక్తి కర్తవ్యానికి, బాధ్యతకు అత్యంత ప్రాధాన్యం. మా ఊరి రక్షణలో నా బాధ్యత వదలి నీతి పారిపోవటం నా మనస్సాక్షి ఒప్పదు. నిన్ను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమిస్తున్నాను. యుద్ధం తర్వాత కలుద్దాం' అంది.

అతడిని వదలలేక వదలలేక వెళ్లింది. వెనక్కి తిరిగి చూస్తూనే ఉంది.

చేపల్లాంటి ఆమెకళ్లు అతడిపైనే నిలిచాయి, గుర్రం మలుపు తిరిగే వరకూ అతడు స్థాణువులా నిలిచాడు. బండరాయిలా మిగిలిపోయాడు.

**************

శత్రువుల దాడి అన్నది ఊహకాదు, భయంకరమైన సత్యం అన్న విషయం త్వరలోనే నిరూపణ అయింది. దాంతో ఆయుధాల తయారీకోసం ఆమె, ఆమె తండ్రి రాత్రింబవళ్లు శ్రమించసాగారు. ఆమెకు మరో ధ్యాస అంటూ లేకుండా పోయింది. ఆమె యాంత్రికంగా పనిచేస్తూ ఉన్నా ఆమె మనసు అతని చుట్టే తిరుగుతోంది.

'అతడు అన్నమాటలు యదార్థాలు. నేను ఊరు కదలలేను' అనుకుంది పలుమార్లు.

ఎన్ని ఆయుధాలు తయారుచేసినా ఇంకా అవసరమంటున్నారు.

**************

ఆమెకోసం ఎదురుచూస్తూ అతడు ఊరికావల నదీతీరంలో ఎదురుచూస్తూనే ఉన్నాడు.

ఆమె రాలేదని అతడికి తెలుసు. కానీ రాని ఆమె రాకకోసం ఎదురుచూస్తూ రాత్రింబవళ్లు ఒంటరిగా మిగిలిపోయాడతడు.

అందరూ భయపడుతూ ఎదురుచూస్తున్న ఘడియ రానే వచ్చింది.

శత్రుసేన తుపానులా ఆ గ్రామాన్ని తాకింది.

అందుకోసం సిద్ధంగా ఉండి, ఎదురుచూస్తూన్నా, ఆ తాకిడి తీవ్రతకు గ్రామం ప్రజలు ఊగిపోయారు. నిలవలేకపోయారు.

ఆమె తండ్రి పక్కనే ఆయుధాన్ని ధరించి నిలబడింది.

గ్రామప్రజలు శత్రువుతో వీరోచితంగా పోరాడేరు. కానీ శత్రుబలం ముందు నిలవలేకపోయారు. ఆమె అత్యంత శౌర్యసాహసాలు ప్రదర్శిస్తూ శత్రువుపై విరుచుకుపడింది.

ఆమె పోరాట పటిమ శత్రువులను ఆశ్చర్యపరచింది. వారు అయిష్టంగా, ఆమెను తమ కత్తికి ఎరవేశారు. లేకపోతే ఆమె కత్తికి తాము ఎరలవుతామన్న భయం వారికి కలిగింది.

**************

ఆమెకోసం ఎదురుచూస్తూన్న అతడికి వార్త పిడుగులా తాకింది.

'గ్రామం నిర్జీవమయింది. ఒక్కరిని కూడా ప్రాణాలతో వదలకుండా సంహరించి మరో గ్రామంవైపు దూసుకుపోయింది శత్రుసేన'

ఈ వార్త వింటూనే అతడి శరీరం కంపించింది. ఆ కంన తీవ్రత తగ్గిన తరువాత శరీరం స్థాణువయిపోయింది.అదే సమయానికి నదికి వరద వచ్చింది. వరద నీరు ఆ ప్రాంతాన్ని ముంచెత్తింది. వరద నీటిలో నిశ్చలమైన బండరాయిలా నిలచి, ఆమెకోసం ఎదురుచూడసాగాడతడు.

**************

ప్రజల హర్షధ్వానాలు మిన్నంటాయి.

నీరు వెనక్కు తీయసాగింది. వెనక్కుపోతున్న నీటితో చేపకూడా నదిలోకి వెళ్లిపోసాగింది. అంతవరకూ చైతన్యంతో తళతళలాడిన ఆ రాయి, నెమ్మదిగా చైతన్యరహితమైపోతోంది.

బండరాయిగా మిగిలిపోయింది. ఆ రాయిని వీడలేక వీడలేక వెళ్లిపోతోంది చేప.

ఆ దృశ్యం చూస్తున్న అందరి హృదయాలు బరువెక్కాయి.

మళ్లీ ప్రవాహానికి ఎదురీదుతూ చేపవచ్చి బండరాయిని కలిసే రోజు వరకూ అక్కడే నిలిచి ఎదురుచూడాలన్న కోరిక వారందరికీ బలంగా కలిగింది.

ఉజ్బెకిస్తాన్‌లోని 'షాజువరా' దగ్గర ఉన్న త్రివేణి సంగమం 'సెవెమ్' నది వద్ద  ఆ రాయిని, చేపను చూసేందుకు ఇప్పటికీ ప్రజలు ఎగబడతారు. వారి అమర ప్రేమగాధను స్మరిస్తారు.






**టీచర్:** రవీ! ఎదుటి వాళ్లకి ఆసక్తి లేకున్నా మాట్లాడేవారిని ఏమనాలి?
**రవి:** టీచర్.

**భార్య:** ఏమండీ..నేను చచ్చిపోతే మీరేం చేస్తారు?
**భర్త:** చచ్చిపోతాను

**భార్య:** నేనంటే అంత ఇష్టమా?
**భర్త:** ఒక్కోసారి ఎక్కువ సంతోషాన్ని తట్టుకోలేం కదా.

**కొడుకు:** నాన్నా! నువ్వు ఈజిప్టు ఎప్పుడు వెళ్లావు?
**నాన్న:** నేను ఈజిప్టు ఎప్పుడూ వెళ్లలేదు. అయినా నీకెందుకు ఆ సందేహం వచ్చింది?
**కొడుకు:** మరి మమ్మీనిఎక్కడనుంచి తీసుకొచ్చావు?



# దారి చూపుతారా



## పదాన్వేషణ-20

నిర్వహణ
గుల్ మహమ్మద్ నాయక్

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| R,A | B,E | C,L | S,W | M,N | D,P |

పిల్లలూ! కింది ఆధారాలకు ఎదురుగా ఉన్న అంకెలను చూడండి. ఆ అంకెలతో సంబంధం ఉన్న పై గళ్లలోని రెండు అక్షరాలతో ఆధారానికి తగిన జవాబును రెండు ఆంగ్ల పదాలతో రాయండి.

ఉదా:ఆధారం: డబ్బులు పెట్టుకునే చిన్న సంచి-5,6

అంటే 5వ గడిలోంచి ఒక అక్షరం, 6వ గడిలోంచి ఒక అక్షరం తీసుకుని జవాబు రాయాలి.

జవాబు: 5వ గడిలోంచి 'M', 6వ గడిలోంచి 'P' తీసుకుని 'MONEY PURSE' అని జవాబు రాయాలి.

ఆధారాలు:

1. బట్టలు ధరించడంలో నిబంధన. -6,3.........
2. అపాయకరమైన ప్రయత్నం. - 1,2 ........
3. ఇంజక్షన్ మందులో కలిపే నీరు. -6,4 ..........
4. పెరిగిన గోళ్లను దీనితో కత్తిరించుకోవచ్చు - 5,3 ..............
5. ప్రకటన తెలిపే పలక. -5,2................

### మీకు తెలుసా?

* ప్రపంచవ్యాప్తంగా ఏటా పిడుగుపాట్ల వల్ల దాదాపుగా 1000మంది మరణిస్తుంటారు.

* ఆల్ప్స్ పర్వతాలు ఏర్పడటానికన్నా ముందే డైనోసార్లు ఉనికి లేకుండా పోయాయి.

# అందాల రాక్షసి

కథ

"అమ్మో రక్తం..రక్తం.." అంటూ పరుగెత్తుకొచ్చింది చిన్ని.

చిన్ని నోటినిండా రక్తం చూసి అక్కడే చింతచెట్టుకింద ఆడుకుంటున్న మాలతి, శుభ, రాము, గిరి, దాసు అందరూ చాలా కంగారుపడిపోయారు. ఇంతలో చిన్ని చేయి చాచి రక్తంలో తడిచిన ముత్యమంటి వస్తువేదో భయం, భయంగా చూపింది. అంతే, అందరికీ చిన్ని పన్ను ఊడి పోయిందని. అర్థమయ్యింది. అందరూ... "మరేమీ పరవాలేదు చిన్నీ! నోరు కడుక్కో!' అన్నారు. చిన్నికేమో చాలా భయంగా, కంగారుగా అనిపించింది. ఇంటికి వెళ్లిపోదామనుకున్నది. కానీ పిల్లలంతా చిన్ని చుట్టూ చేరి ఊడిపోయిన ఆ పన్నును పిడతలో దాచాలని ఒకరు.. గుంత తవ్వి అందులో పాతి పెట్టాలని ఒకరు..తలో సలహా చెప్పారు. చిన్ని నోరు కడుక్కొచ్చుకునే లోపల చింతచెట్టు కవతల చిన్న గుంత కూడా తీశారు. చిన్ని అందులో ఆ పన్ను వేసింది. అందరూ చేరి అది కప్పెట్టారు.

"ఎందుకట్లా గుంతలో పెట్టాలి?" అడిగింది.

"అట్లా చేయకుంటే నీకు రాక్షసి పళ్లొస్తాయి తెలుసా!" అన్నారు. అంతేకాదు, చిన్ని చుట్టూ తిరుగుతూ.. "తొర్రిపళ్ల తొండ..మా ఊరి బండా" అంటూ పాడసాగారు.

చిన్ని నోరు చూస్తూ "అబ్బో! ఎంత పెద్ద సందో..దొంగలు దూరిపోతారు" ఒకరనగానే అంతా ఏడిపించసాగారు.

దాంతో చిన్నికి బాగా ఏడుపు వచ్చింది. ఏడుస్తూ ఇంటకెళ్లి "అమ్మా! నా పన్ను ఊడిపోయింది"చెప్పింది.

"అవునా ఏది చూపించు" అంటూ చూసి, "మరేమీ కంగారు పడకు, నీకు మళ్లీ కొత్త పన్ను వస్తుందిలే" అని చెప్పింది.

అంతలో చిన్ని వాళ్ల మామయ్య వచ్చి.. "ఏది చిన్నీ..నీ నోరు చూపించు భలే



ఉన్నావే తొర్రిపళ్లతో" అని నవ్వాడు. చిన్నీ వాళ్ల అన్న వచ్చి చిన్ని తొర్రి చూసి నవ్వాడు.

ఆరోజునుండి ఎవరో ఒకరు "ఏది ఒక పద్యం చెప్పు", ఒక పాట పాడు" అనడం, చిన్ని పాడుతుంటే "తొర్రిపళ్లేసుకుని భలేపాడుతుంది చూడు" అని నవ్వడం, చిన్ని ఉడుక్కోవడం మామూలయిపోయింది.

ఇక చిన్ని పడుకుంటే చాలు తనకు ఎప్పటికీ ఊడిపోయిన ఆ పన్ను రానట్లు ఒకసారి కలవస్తే..మరోసారేమో తనకు రాక్షసికి వచ్చినట్లు పెద్దపెద్ద కోరపండ్లు వచ్చినట్లు కలలు వస్తున్నాయి. రోజూ అద్దం ముందు నుంచుని పన్ను వచ్చిందా లేదా అని చూసుకుంటూ ఉండేది. మూడు, నాలుగు రోజులయినా ఇంకా పన్ను రాకపోయేసరికి చాలా







# చిన్నారుల ప్రపంచం

వార్త ఆదివారం

భయపడసాగింది. ఆ రాత్రి అమ్మ దగ్గరచేరి "అమ్మా! నాకు నిజంగా రాక్షస పళ్లు వస్తాయా?" అని అడిగింది.

"ఎందుకమ్మా అలా అడిగావు' అంది అమ్మ.

"మరి ఊడిపోయిన పన్ను గుంత తీసిన గుంతలో పెట్టక పోతే రాక్షస పళ్లు వస్తాయటకదా. నేను నిజంగా గుంత తవ్వి పన్ను పాతిపెట్టా నమ్మా. కానీ నాకు రాక్షసపళ్లు వస్తాయేమోనని భయం వేస్తుందమ్మా" అంటూ ఏడిచింది.

"పిచ్చిపిల్లా! అట్లా ఊడిపోయిన పన్ను ఎక్కడైనా పాతి పెట్టకపోతే నీలాటి మరో చిన్న పిల్ల ఎవరైనా చూసి దడుచుకుంటారని..అది ఎవరికీ గుచ్చుకోకుండా ఉంటుం దని.. రాలిపోయిన పండ్లని గుంత తవ్వి కప్పిపెడతారు. నీకు మామూ లుగానే పళ్లు వచ్చేస్తాయి. మరేమీ భయపడకు" అని దగ్గరకు తీసుకుని ధైర్యం చెప్పింది.

వారంరోజుల్లో చిన్నికి పన్ను వచ్చి అది చక్కగా పెరగసాగింది.

"అమ్మా..అమ్మా..నాకు పన్ను వచ్చేసింది. రాక్షస పన్ను కాదు. మంచి పన్ను వచ్చింది" అంది ఆనందంగా.

"ఏది చూపించు" అంటూ చూసి.. నువ్వు మా అందాల రాక్షసివమ్మా" అంటూ అమ్మ, చిన్నిని ముద్దాడింది.

**–సమ్మెట ఉమాదేవి**

[illegible]-20 [illegible]

1. DRESS CODE
2. RISKY EFFORT
3. DISTILLED WATER
4. NAIL CUTTER
5. NOTICE BOARD

## హలో ఫ్రెండ్...



**చిన్నారుల ప్రశ్నలకు**

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

## గిరీష్ అంకుల్ సమాధానాలు

**-వి.రవికిరణ్, హైదరాబాద్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. బ్యాక్టీరియాను ఎవరు కనుగొన్నారు? బ్యాక్టీరియా గురించి దయచేసి వివరించండి.**

**జవాబు:** రవికిరణ్! బ్యాక్టీరియాను మొట్టమొదటిసారిగా 1683లో డచ్ శాస్త్రవేత్త వాన్ లీవెన్ హాక్ కనుగొన్నాడు. సూక్ష్మదర్శినిని ఉపయోగించి పంటి మీద ఉన్న పింగాణిపొరను పరిశీలించగా కదులుతున్న సూక్ష్మజీవులనేకం ఉండటాన్ని గమనిం చాడు. శాస్త్రప్రపంచంలో ఈ సంఘటనను ఒక విప్లవమే. ఆ తర్వాత అధునాతన పరికరాల సృష్టి అనేక పరిశోధనలకు జీవంపోసింది. పరిశోధనల ద్వారా బ్యాక్టీరియా నిర్మాణం గురించి తెలుసుకోవటంద్వారా వ్యాధుల్ని నివారించగల విధానాన్ని తెలుసు కోవడం సులభమైంది. మానవాళి ఆరోగ్యాన్ని దెబ్బతీస్తున్న అనేక కొత్తకొత్త రకాల బ్యాక్టీరియా, వైరస్‌లు పెరిగిపోయాయి. శుభ్రత లోపించిన అన్ని ఆహారపదార్థాలు బ్యాక్టీరియాకు నెలవులే. ఆహారపదార్థాల్లోనేకాదు, మనం తాగే నీటిలోనూ బ్యాక్టీరి యా నివాసం ఉంటుంది. ఇవి త్వరగా వృద్ధి చెందటానికి ఈ పదార్థాలు ఎంతగానో తోడ్పడతాయి. బ్యాక్టీరియాల మీద ఫ్లాజెల్లం ఉంటుంది. దీనివల్ల అవి వేగంగా కదల గలుగుతాయి. ఈ ఫ్లాజెలం పొడవుగా, బెండు మాదిరిగా తేలికగా ఉండి అటు, ఇటు కదులుతూ ఉంటుంది. బ్యాక్టీరియా ప్రత్యేక పద్ధతిలో ఫ్లాజెల్లంను ఉపయోగించుకుం టాయి. బ్యాక్టీరియాలోని ఫ్లాజెల్లం నిర్మాణ వ్యవస్థ, మోటారు వాహనాల మాదిరిగా గుండ్రంగా తిరుగుతూ ఉంటుంది. వీటి చలనం తెలుసుకోవడం వల్ల వ్యాధి ఎలా నిరోధించవచ్చో తెలుసుకోవచ్చు. అసలు ఆహార పదార్థాలను బ్యాక్టీరియా ఎలా గుర్తి స్తుందన్నది ఆసక్తికరమైన అంశం. ఆహార పదార్థాల జాడ తెలియగానే బ్యాక్టీరియాలో ఉండే రసాయనాలు వాటిని గుర్తిస్తాయి. బ్యాక్టీరియా తనకు నచ్చిన పదార్థంవైపు చలించే శక్తి కలిగి ఉంటుంది. అంటువ్యాధులు వ్యాపించడానికి ఇవే కారణం. తగు జాగ్రత్తలు తీసుకొంటే వీటి నుండి ప్రమాదాలను నివారించవచ్చు.

**కె.పావని, విశాఖ.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. సముద్రానికి, మహాసముద్రానికి తేడా ఏమిటి? దయచేసి చెప్పండి.**

**జవాబు:** పావనీ! సముద్రంకంటే మహాసముద్రం చాలాపెద్దదని పేరులోనే తెలుస్తోంది కదా. సముద్రాలకు చుట్టూ భూమి ఉంటుంది, లేదా భూమి కొన్నివైపుల హద్దుగా ఉంటుంది. కానీ మహాసముద్రాలకు హద్దులుండవు. వాటి పరిమాణాన్ని కొలవటం అసాధ్యం. మధ్యధరా, అరేబియన్ వగైరాలు సముద్రాలుకాగా, అట్లాంటిక్, ఇండియన్, పసిఫిక్, ఆర్కిటిక్‌లు మహాసముద్రాలు.



# ధనంకన్నా జ్ఞానం కీలకం!

బాలగంగాధర తిలక్ భారత స్వాతంత్ర్య సమరయోధుల్లో ప్రాతః స్మరణీయులు. ఆయన జ్ఞానం ద్వారానే మనిషికి సమస్యల నుంచి ముక్తి లభిస్తుందన్నారు. లౌకిక అర్థం లోనే అన్నమాట అది. ఆధ్యాత్మికంగా చూసినా అదే ప్రకటన అర్థవంత మైంది. స్వాతంత్ర్యం నా జన్మహక్కు! అని నినదించిన గొప్ప దేశభక్తుడు ఆయన. ఆ మాట వెనుక, నినాదం వెనుక కేవలం రాజకీయ స్వాతంత్ర్యమేగాక అన్ని రకాల బానిసత్వాల నుంచి విముక్తి కావాలన్న కాంక్ష కనిపిస్తుంది. దీనికి మూలాధారం 'జ్ఞానం'.

18వ శతాబ్దం ఆఖరులో అంటే 1772లో బెంగాల్‌లో జన్మించిన రాజారామ్ మోహన్‌రాయ్ కూడా జ్ఞానం ద్వారానే (చైతన్యం ద్వారానే) సమస్యల నుంచి మనిషికి ముక్తి లభిస్తుందని చెప్పారు. గొప్ప సంఘసంస్కర్తగా ఆయన పేరొందారు. ఆయన జ్ఞానం కేంద్రంగా పనిచేశారు. ఆయన స్థాపించిన బ్రహ్మసమాజం జ్ఞానానికి నిలయం.

భారతదేశ పునరుజ్జీవ (రినైజాన్స్) అంకురం ఆయనతోనే ప్రారంభమైనదని చరిత్ర చెబుతోంది. ఆయన జ్ఞానం ఆధారంగా తీసుకొచ్చిన చైతన్యం సమాజం నిండా పరచుకుంది. ముఖ్యంగా అంధ విశ్వాసాలను, మూఢనమ్మకాలను ఆయన ఎంతో సమర్థవంతంగా ఎదుర్కొని మహిళ లకు ఎంతో మేలుచేశారు. సతీ సహగమనం లాంటి దురాచారాన్ని సంప్రదాయం నుంచి దూరంచేసి వారికెంతో వైభవం తీసుకొచ్చా రు. ఆధునిక విద్యకు బీజం వేశారు. జ్ఞానం అందరికి చేరాలని పాటుపడ్డారు.

అదే బెంగాల్ రాష్ట్రంలో 1872లో జన్మించిన అరబింద్ ఘోష్ ఓ జ్ఞాన కెరటం. ఉత్తుంగ తరంగం. విప్లవ భావాలను విత్తినవాడు. వందేమాతరం పత్రికను నడిపి దేశభక్తిని నలుదిశల వ్యాపింపజేశారు.

మహారాష్ట్రలో బాలగంగాధర్ తిలక్ ఎగరేసిన జ్ఞానజండాను ఘోష్ మరింత ఎత్తుకు లేపారు. దానికి విప్లవ భావ భాస్వరాన్ని అద్దారు. సుషుప్తావస్థలో ఉన్న దేశాన్ని తన కార్యాచరణతో మేల్కొల్పారు. ఆయన కవి, రచయిత, ఆధ్యాత్మిక వేత్త కూడా. ఆధ్యాత్మిక రంగంతోపాటు సేవారంగంలో అరబిందోకు ముందు మనకు వివేకానందుడు కనిపిస్తాడు. ఆయన జ్ఞానం అపారం. చికాగోలో జరిగిన సర్వమత సమ్మేళనంలో ఆయన చేసిన ఉపన్యాసం పెద్ద సంచలనం కలిగించింది. భారతీయ జ్ఞాన ఆత్మను ఆయన అక్కడ ఆవిష్కరించి అభినందనలు అందుకున్నారు. ఉక్కు కండరాల యువకులను సేవారంగంలోకి ఆహ్వానించి జ్ఞానదారులను విశాలం చేశారు.

గత రెండువందల సంవత్సరాల్లో ఆయా సమయానుకూలమైన జ్ఞానం దేశాన్ని ఉత్తేజ పరుస్తున్న సంగతిని గమనంలోకి తీసుకోవాలి.



సామాజిక, ఆధ్యాత్మిక రంగాల్లోనేగాక పారిశ్రామిక రంగంలో జెంషెడ్జీ టాటా (1839 సంవత్సరం) జ్ఞానానికి ఎల్లలు లేవు. ఆయన దేశాన్ని పారిశ్రామికంగా అగ్రభాగాన నిలిపారు. పాశ్చాత్య దేశాల విజ్ఞానాన్ని మెరుగైన రీతిలో భారతదేశంలో పరిచయం చేసి నూతన అధ్యాయాన్ని ప్రారంభించారు. ఆధునిక సైన్స్, టెక్నాలజీకి ఆయన పాదులు కట్టారు.

ప్రపంచంలో ఆనాడు ఎక్కడాలేని విధంగా కార్మికుల సంక్షేమం కోసం ప్రావిడెంట్ ఫండ్, గ్రాట్యూటీని ప్రవేశపెట్టారు. వచ్చిన లాభాలను సమాజసేవకు, విద్యకు ఖర్చుచేశారు. పెట్టుబడిదారులకు ఆదర్శంగా నిలిచారు. దేశంలో తొలి ఉక్కు కార్మాగారానికి శంకుస్థాపనచేశారు. తొలి బట్టల మిల్లును ప్రారంభించారు. తొలి విద్యుత్ ప్లాంట్‌ను తెరిచారు. అతిథుల కోసం అందమైన హోటల్‌ను ముంబాయిలో నిర్మించారు. దేశంలో తొలిసారిగా విద్యుత్ వినియోగం ఆ హోటల్‌లోనే జరిగింది. ఇది అంత చిన్న విషయమేమీకాదు. ఎన్నో వ్యవస్థలు చేయాల్సిన పనిని ఆయన ఒక్కరు చేసి చూపించారు. ఆయన నెలకొల్పిన మార్గదర్శకాలపైనే ఇప్పటికీ టాటా సంస్థలు పనిచేస్తున్నాయి. వచ్చిన ఆదాయంలో 66శాతం పేదల అభివృద్ధి, విద్య, సాంకేతికరంగ పరిశోధనలు, సామాజిక సేవ, స్కాలర్‌షిప్పుల కోసం ఖర్చు చేస్తున్నారు.

ఈ వదాన్యతకు కొనసాగింపు అన్నట్లు స్వామి రామ్‌దేవ్ బాబా తన పతంజలి యోగపీఠ్ ద్వారా తయారైన వస్తువులు అమ్మగా వస్తున్న లాభాలను పూర్తిగా (నూటికి నూరుశాతం) ప్రజలకోసం, గ్రామీణ ప్రజల అభ్యున్నతికోసం ఖర్చు చేస్తున్నారు. సన్యాసి రామ్‌దేవ్ బాబా పెద్దగా చదువుకోకపోయినా, యోగా ద్వారా తన 'జ్ఞానం' ద్వారా ప్రపంచం నలుమూలలా తన పతంజలి ఉత్పత్తులను పంపిణీ చేస్తున్నారు. యోగాను, ఆయుర్వే దాన్ని అందరికీ దగ్గర చేశారు.

ఈ చైతన్యం, జ్ఞానం అపురూపమైనది. ఆధునిక భారతదేశంలో రాజారామ్ మోహన్ రాయ్‌ది ఓ జ్ఞాన మార్గమైతే, రామ్‌దేవ్ బాబాది మరో జ్ఞానమార్గం. గత రెండు వందల సంవత్సరాల్లో ఇలాంటి ఎందరో ప్రముఖులు దేశ యువతను జ్ఞాన దారులవైపు పయనించేలా ప్రోత్సహిస్తు న్నారు. స్ఫూర్తిదాయకంగా నిలుస్తున్నారు.

నాల్గవ పారిశ్రామిక విప్లవం కొనసాగు తున్న ఈ సమయంలోనూ జ్ఞానానికి, సాంకేతికతకు పెద్ద పీటవేసిన సత్య నాదెళ్ల లాంటివారు మనముందున్నారు.

వేదకాలం నాడు వేదాలు జ్ఞాన భాండా గారాలు, రామ్మోహన్ రాయ్ కాలానికి సంస్కరణలతో కూడిన జ్ఞానం ఎందరి జీవితాల్లోనో వెలుగులు నింపింది. ఇప్పుడు సైతం 'జ్ఞానం' ఇంధనంలా పనిచేస్తున్నది. ధనంకన్నా జ్ఞానం కీలకమైనదని మన చుట్టూ ఉన్న వాతావరణమే వెల్లడిస్తోంది. మన చేతిలోని స్మార్ట్‌ఫోనే అందుకు నిదర్శనం. కాదంటారా?

**-ఉప్పల నరసింహం**

# మూషిక వైభోగం!

'భాగ్యవంతుల ఇంట శునకంగా పుట్టినా అదృష్టమే' అని భావిస్తుంటారు కొంతమంది. ఐతే శునకంగానే కాదు, మూషికంగా పుట్టినా మేలే' అనిపిస్తుంది మాంచెస్టర్‌లోని ఓ మూషికానికి పట్టిన అదృష్టాన్ని గురించి తెలుసుకుంటే.

మాంచెస్టర్‌లోని టిఫనీ ఝూంగ్ అనే 29 ఏళ్ల యువతి ఓ ఎలుకను పెంచు కొంటోంది. ఆ ఎలుకగారి పేరు చీజ్. బొమ్మలో చూశారుగా, చీజ్ ఎలా టిఫనీ భుజం మీద దర్జాగా కూర్చుందో! దానికోసం ఆమె ఓ చిన్ని ఇల్లు బొమ్మను కొన్నది. బొమ్మంటే ఆషామాషీకాదు. ఆ ఎలుక ఇంట్లో ఓ చిన్న బెడ్‌రూమ్, ఫర్నిచర్, తినడానికి సైతం ఏర్పాట్లు..అంతేనా, దాంట్లో మెట్లు, గదులు, వేర్వేరు చోట్ల పడుకునేందుకు లేదా తినేందుకు ఏర్పాట్లు ఉన్నాయి. టిఫనీ ఆ ఎలుకకు దాని బెడ్‌రూమ్‌ను ప్రతిరోజు శుభ్రపరచుకునేలా శిక్షణ ఇచ్చింది.

చీజ్ గురించి చెపుతూ టిఫనీ ఇలా అంటుంది..చీజ్ పదహారు నెలలుగా నా దగ్గర ఉంటోంది. నా దగ్గరున్న పెంపుడు జంతువులన్నిటికంటే చీజ్ ప్రత్యేకమైందిగా అనిపించింది. రోజూ చీజ్ తన బెడ్‌రూమ్‌ను తానే శుభ్రం చేసుకుంటోంది. అందులో భాగంగానే తనకు అవసరం లేని వాటన్నిటిని బయటకు విసిరేస్తుంది.(తన విసర్జనలతో సహా)

పగలంతా తనకు నచ్చినట్లు తింటుంది, పడుకుంటుంది, ఏదో ఒకటి కొరుకుతుంది, తనకు తాను సంరక్షణ చేసుకుంటుంది.

చీజ్ ఎంత తెలివైనదంటే ఏదైనా చెపితే చక్కగా నేర్చుకుంటుంది. నేను, దానికి యోగర్ట్‌ను చిన్నిచిన్ని స్పూన్లతో తినడం నేర్పాను.

నేను ఓ క్రాఫ్ట్స్ షాప్‌నుంచి డిఐవై డాల్స్ హౌస్ సెట్‌ను కొన్నాను. అందులోకి కావలసిన ఫర్నిచర్‌ను కూడా మా బుల్లి ఎలుకగారికి సరిపోయే సైజువి నెట్‌లో చూసి, ఎంచుకుని తెప్పించుకున్నాను.

మిని కుషన్లు, ప్లేట్లు, స్పూన్లు, గిన్నెలు జపాన్‌లో కొన్నాను. నేను టోక్యో వెళ్లినప్పుడు కొన్నాను వాటిని. బొమ్మలను, డిజైనర్ కలెక్టిబుల్స్‌ను సేకరించటం నాకు మొదటినుంచీ ఎంతో ఇష్టం. పైగా అవన్నీ ఎంచక్కా సరిగ్గా అమిరాయి కూడా. అన్నిటినీ పాడుచేస్తాయని మనం ఎలుకలను తరిమేస్తుంటాం. కానీ టిఫనీ చూడండి ఎలా పెంచుతోందో. అది ఎంచక్కా తన బుల్లి ఇంట్లోనే కాలక్షేపం చేస్తూ, యజమానురాలి అభిమానానికి పాత్రురాలు కావడం విశేషమేకదూ.









# చేజారిన బహుమతి

**– సి.ప్రణయజ**

**"హలో! సుబ్బారావుగారి ఇల్లాండీ! అటు నుండి వాకబు.**

**"అవునండీ! మీరెవరు?" అడిగింది సుజాత.**

**"మేం మునిసిపల్ కార్యాలయం నుండి చేస్తున్నాం. సుబ్బారావుగారి ఇంటి టాక్సుకు ఆధార్ కార్డు నంబరు కావాలి, చెప్పగలరా?"**

**"ఆధార్ నంబరా?" ఆశ్చర్యంగా అడిగింది సుజాత. "నాకు తెలియదండీ, మీ ఫోను నంబరు ఇస్తే మా వారితో ఫోను చేయిస్తాను" తడబడుతూ అంది.**

"సుబ్బారావుగారిని మునిసిపల్ కార్యాలయానికి రమ్మని చెప్పండి" అంటూ ఫోను పెట్టేశారు.

"ఏమండీ! మునిసిపల్ కార్యాలయం నుండి ఫోను చేసి మీ ఆధార్ నంబరు అడిగారు. మనకు ఆధార్ నంబర్ లేదు కదా. ఎట్లా?" కంగారుగా సుబ్బారావుకు ఫోను చేసింది.

"వాళ్ల అంతే. అడుగుతారులే. నువ్వు కంగారు పడవద్దు. పనిలో ఉన్నాను. ఇంటికి వచ్చిన తరువాత మాట్లాడుతాను" అంటూ ఫోను పెట్టేశాడు.

వారం తరువాత మునిసిపల్ కార్యాలయం నుండి మళ్లీ ఫోను. ఈసారి సుబ్బారావే ఫోను తీశాడు. "ఇస్తాంలెండి. ఆఫీసులో పని ఎక్కువగా ఉంది" అన్నాడు తాపీగా.

"ఆధార్ నంబర్ చాలా అవసరం. మీకు ఆఫీసులో ఎక్కువ పని ఉండటానికి, నంబర్ చెప్పడానికి సంబంధం ఏమిటి?" అటువైపు నుండి విసుగ్గా ప్రశ్న.

"ఇంకా ఆధార్ కార్డుకు దరఖాస్తు పెట్టుకోలేదు. వచ్చిన వెంటనే మీకు నంబర్ ఇస్తాను" నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు సుబ్బారావు.

"డాడీ! నేను రేపటి నుండి బడికి వెళ్లను" ఒకరోజు బడి నుండి వస్తూనే అంది మాధురి, సుబ్బారావు కూతురు. రెండవ తరగతి చదువుతున్నది.

"ఎందుకమ్మా! టీచరు కొట్టారా?" పిల్లలు బడికి వెళ్లము అంటే తల్లిదండ్రులు ముందు అడిగే ప్రశ్న అది.

"లేదు. నన్ను ఆధార్ నంబరు తీసుకొని రమ్మన్నారు. నువ్వేమో ఇంతవరకు ఇవ్వలేదు" ఏడుస్తున్నట్లు అంది.

"ఆధార్ నంబరా? స్కూలు వాళ్లకి ఆధార్ నంబరు ఎందుకట? సరిగ్గా చదువు చెప్పమను చాలు" విసురుగా అన్నాడు.

"అదేంటండీ అలా అంటారు? వాళ్లకు అవసరమయ్యే కదా అడిగారు" అంది సుజాత.

"చదువుకు, ఆధార్ నంబరుకు సంబంధం ఏంటే? వాళ్లేదో మన పిల్లల గురించి శ్రద్ధ తీసుకుంటున్నట్లు పోజు" కోపంగా అరిచాడు.

"డాడీ! నంబరిస్తేనే నేను బడికి వెళతాను" మళ్లీ అదే మాట అంది మాధురి.

"సరేలే. నేను మీ టీచరుతో మాట్లాడతాను" అన్నాడు సుబ్బారావు. కానీ మాట్లాడలేదు. వారం తరువాత టీచరు ఆయనకు ఫోను చేసింది.

"సుబ్బారావుగారూ! మాధురి ఆధార్ నంబరు ఇంకా ఇవ్వలేండి. దయచేసి పంపించండి" ప్రాధేయపడుతూ అడిగింది.

"టీచరుగారూ! ఇంకా తీసుకోలేదండీ, తీసుకున్న వెంటనే పంపుతాను. మాధురిని కోప్పడకండి. అయినా ఆధార్ నంబరు ఎందుకండీ?" విసురుగా అడగబోయి గొంతు మార్చాడు.

"డి.ఇ.ఓ. ఆఫీసు నుండి పిల్లల విషయాలు తెలుపమని ఉత్తరువు వచ్చింది. ఇప్పటికే చాలా రోజులు గడిచిపోయాయి. దయచేసి వీలైనంత తొందరగా ఆధార్ నంబరు పంపండి" అని పెట్టేసింది.

"మాధురీ! మీ టీచరుగారితో మాట్లాడాను. నిన్ను నంబరు తెమ్మని అడగరులే. ఇంటికి వస్తూనే కూతురుకు ధైర్యం చెప్పాడు సుబ్బారావు. సుజాత అసహనంగా అతన్ని చూసింది.

ఒకరోజు రాత్రి పదకొండు గంటలకు ఫోను మోగితే అదిరిపడి తీశాడు.

"బావా? నాన్నగారికి ఆరోగ్యం బాగోలేదు. ఆసుపత్రిలో చేర్చాం. సుజాతని చూడాలంటున్నాడు. దయచేసి పంపు" అంటూ సుజాత తమ్ముడు రమేష్ ఫోను చేశాడు.

"ఏమయింది?" కంగారుగా అడిగాడు, సుబ్బారావు.

"ఇంకా ఏమి తెలియలేదు. సుజాతను, పిల్లల్ని వెంటనే పంపండి".

అది విన్న సుజాత ఏడుపు మొదలుపెట్టింది.



బస్సులో పంపాలంటే సుజాతకు బస్సు ప్రయాణం పడదు. రిజర్వేషను లేకుండా పిల్లలతో అంత దూరం రైలు ప్రయాణం చేయడం కష్టం.

మరుసటి రోజు ఉదయమే రైల్వే స్టేషనుకు వెళ్లి క్యూలో నిలబడ్డాడు. అతని వంతు వచ్చేసరికి ఆధార్ కార్డు నంబరు అడిగారు.

"అదేంటి సార్! ఇదివరకు ఇలా లేదు కదా, నేను తీసుకొని రాలేదు" దబాయింపుగా అన్నాడు.

"మీరు ప్రయాణం చేసి చాలా నెలలైనట్లు ఉంది. రిజర్వేషన్‌కు ఆధార్ నంబరు అవసరం" అన్నాడు కౌంటరులో ఉన్నాయన ఏమీ పట్టనట్లు.

"ఆధార్ నంబరు లేకుంటే రిజర్వేషను చేసుకోరా?" భయం భయంగా అడిగాడు.

"చేసుకోమండి" అన్నాడు వేరే అతనికి టికెట్టు ఇస్తూ.

"ఎలాగో ఒకలాగా జనరల్ బోగిలో వెళతామండి, నాన్న ఆరోగ్య విషయం నాకు భయంగా ఉంది" రిజర్వేషన్‌కు ఆధార్ నంబరు అవసరం అని విని, సుజాత ముక్కు చీదుకుంటూ అంది.

మధ్యాహ్నం రెండు గంటలకు రైలు బయలుదేరుతుంది. వాళ్లు వెళ్లేసరికి 6వ నంబరు ప్లాట్ ఫాం మీద రైలు ఆగి ఉంది. జనరల్ బోగి నిండా జనం కిటకిటలాడుతున్నారు.

సుమన్‌ను ఎత్తుకొని ఎలాగో నెట్టుకుంటూ లోపలికి జొరబడింది సుజాత. మాధురిని లోపలికి పంపాడానికి తల్లకిందులయ్యాడు సుబ్బారావు. ఆ జనం మధ్యలో సుజాత ఎక్కడుందో కనబడలేదు అతనికి. రైలు కదిలింది. సుమన్ ఏడుపు మాత్రం వినిపించింది. "ఆధార్ కార్డులు తీసుకుంటే ఈ శ్రమ ఉండేది కాదు కదా!" అనుకున్నాడు మనసులో బాధగా.

రెండు నెలలు గడిచిపోయాయి. ఒకరోజు "సుబ్బారావుగారండీ మాట్లాడుతుంది?"

"అవును. మీరెవరు?" మళ్లీ మునిసిపల్ కార్యాలయంనుండేమోనని అనుమానంగా అడిగాడు సుబ్బారావు.

"మేం కావేరి ఫ్యాషన్స్ నుండి. మీరు దీపావళికి మా షాపులో బట్టలు తీసుకున్నారు కదా! ఆ సమయంలో మీకు కూపన్ ఇచ్చాం, దానికి మొదటి బహుమతి కారు వచ్చింది".

వాళ్లు ఏమి చెబుతున్నారో సుబ్బారావుకు అర్థం కావడం లేదు. ఆశ్చర్యంతో నోట మాట రావడం లేదు.

ఆయన ముఖకవళికలు చూసి "ఏమిటి?" అన్నట్లు సైగ చేసింది సుజాత.

"మాకా?" అతని మాటలు అతనికే వినబడలేదు.

"అవును సార్. మీ దగ్గర ఉన్న కూపన్, దానితోపాటు ఆధార్ కార్డు కూడా తీసుకొని రావాలి. కంగ్రాచ్యులేషన్స్ సార్" అంటూ ఫోను పెట్టేశాడు అవతలి వ్యక్తి.




"ఏంటండీ? ఎవరు ఫోను చేసింది" భర్తను అయోమయంగా చూస్తూ అడిగింది.

"మనకు... మనకు..." అంటూ ఆగిపోయాడు.

"ఆ... మనకు లాటరీగాని వచ్చిందా?" నవ్వుతూ అడిగింది.

"అవును" అన్నాడు ఫ్రిజ్‌లో నుండి సీసాలో నీళ్లు గడగడా తాగుతూ.

"సరిగ్గా చెప్పండి. ఏమయింది?" విసుగ్గా అడిగింది.

"దీపావళికి కావేరి ఫ్యాషన్స్‌లో బట్టలు తీసుకున్నాం కదా! అప్పుడు మనకు కూపన్లు ఇచ్చారు. దానికి మనకు మొదటి బహుమతిగా కారు వచ్చిందట" ఎలానో తమాయించుకొని చెప్పాడు.

"ఏంటీ?" గుడ్లు తేలేసింది సుజాత.

"మనకు కారు బహుమతి వచ్చిందా?" నమ్మలేకపోయింది.

హడావుడిగా తయారయి స్కూటర్ తీయడానికి బయటికి పరుగెత్తి తాళం తీసుకువెళ్లలేదని మళ్లీ ఒక్క అంగలో ఇంట్లోకి వెళ్లి తాళం తీసుకున్నాడు.

"ఎక్కడికండీ!" సుజాత అడుగుతున్నా పట్టించుకోకుండా వెళ్లిపోయాడు.

"నా పేరు సుబ్బారావు. ఇందాక మీ షాపునుండి ఫోను వచ్చింది, మాకు మొదటి బహుమతిగా కారు వచ్చిందని. ఆ విషయం కనుక్కోడానికి వచ్చాను" హడావుడిగా చెప్పాడు.

"కూర్చోండి సార్" అని వాళ్ల దగ్గరున్న కూపన్ ముక్కను చూపించి "ఏది మీ కూపన్ ఇవ్వండి" అడిగారు.

తీసుకొని రాలేదు. ఇప్పుడే తెస్తాను" అంటూ లేవబోయాడు.

"పర్వాలేదు సార్. మీరు మీ కూపన్ ముక్కతో పాటు ఆధార్ కార్డు కూడా తీసుకొని రావాలి" అని మళ్లీ గుర్తు చేశారు. ఎలా వెళ్లాడో అంతే వేగంగా తిరిగి వచ్చాడు ఇంటికి. ఇంతకీ ఆ కూపన్ ముక్క ఎక్కడ పెట్టాడో వెతకాలి.

"ఆ... మనకు అంత అదృష్టమా?" అన్నాడు ఆ రోజు.

"ఏమో! ఏ పుట్టలో ఏ పాముందో, మనకే రావచ్చునేమో! కూపన్ జాగ్రత్తగా పెట్టండి" సుజాత నవ్వుతూ అంది.

ఎక్కడో జాగ్రత్తగానే పెట్టాడు. కానీ ఎక్కడో గుర్తుకు రావడం లేదు. బీరువాలో బట్టలన్నీ బయట పడేశాడు. అక్కడ లేదు. అలమారాల్లో వస్తువులన్నీ చిందర వందర చేశాడు. ఆ కంగారులో ఎక్కడా కనిపించలేదు.

"ముందు మీరు ఈ కాఫీ తాగండి" అంటూ వేడి కాఫీ ఆయన చేతికి అందించింది సుజాత. అలా వెతుకుతూనే ఉన్నాడు. భూకంపం వచ్చినప్పుడు వస్తువులు ఎలా చిందర వందరగా పడిపోతాయో అలా వుంది ఇల్లు.

"సుబ్బారావ్! అలా లైబ్రరీ దాకా వెళ్లి వద్దాం, వస్తావా?" అంటూ లోపలికి వెళ్లిన రామనాథం అదిరిపడ్డాడు.

"ఏం పోగొట్టుకున్నారు సుబ్బారావు?" ఆ ఇంటిని అలా చూసేసరికి అచ్చెరువొందాడు రామనాథం.

"ఒక చిన్న కాగితం కనబడలేదు" ఆ సమయంలో అతను అక్కడికి వచ్చినందుకు మనసులో తిట్టుకుంటూ అన్నాడు.

"సరేలే. ఏదో పనిలో ఉన్నట్టు ఉన్నావు. నేను బయలుదేరుతాను' అంటూ వెళ్లిపోయాడు, రామనాథం.

"హమ్మయ్య" అనుకున్నాడు రామనాథం వేరే ఏ ప్రశ్నలు అడగనందుకు.

"యురేకా" ఉన్నట్టుండి అరిచాడు. కూతురు మాధురి, రెండేళ్ల కొడుకు సుమన్ ఉలిక్కిపడ్డారు.

"సుజాతా! సుమన్ మందుల పెట్టె ఇలా పట్రా!" అన్నాడు.

"మందుల పెట్టా! ఎందుకు?" అర్థంకాక అడిగింది సుజాత. సుమన్‌కి సుస్తి చేస్తే వాడవచ్చని ఒక అట్టపెట్టెలో ఆ అబ్బాయి మందులు పెట్టారు. అది ఎవరు ముట్టుకోరని అందులో పెట్టినట్లు గుర్తుకు వచ్చిందాయనకు. సుజాత తెచ్చేలోగా పరుగున వెళ్లి అతనే తెచ్చాడు. కూపన్ ముక్క అందులో భద్రంగా ఉంది. దాన్ని చూసేసరికి వెయ్యి వాట్ల బల్బులాగా వెలిగిందతని ముఖం. దాన్ని తీసుకొని మళ్లీ షాపుకు బయలుదేర బోయేసరికి ఆధార్ కార్డు గుర్తుకు వచ్చింది.

గుండెలు గుభేలుమన్నాయి. ఆధార్ కార్డు లేకపోతే వాళ్లు కారు ఇవ్వరు. ఏమి చేయాలో తోచలేదు. అదే విషయం సుజాతతో అన్నాడు.

"మునిసిపాలిటీవాళ్లు ఫోను చేసినప్పుడే చెప్పాను, ఆధార్ కార్డుకు దరఖాస్తు పెట్టుకుందామని. మీరు వింటేనా?" మూతి మూడు వంకర్లు తిప్పింది.

"రేపే వెళ్లి దరఖాస్తు పెట్టుకుందాం" అన్నాడే కానీ ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు. ఆఫీసులో సెలవుచీటి ఇచ్చి, పది గంటలకల్లా తాలూకా ఆఫీసుకు వెళ్లాడు భార్య, పిల్లలతో.

"ఆధార్ కార్డు రావాలంటే ఏమి చేయాలండీ?" గుమాస్తాను అడిగాడు. అక్కడున్న వాళ్లు అతన్ని వింతగా చూశారు.

"ఏంటి? ఇంకా తీసుకోలేదా!? ప్రభుత్వం టీవీలో ఎన్ని సార్లు చెప్పినా, పత్రికల్లో ప్రచురించినా మీకు చీమ కుట్టినట్టు కూడా ఉండదు" అసలు విషయం చెప్పకుండా గొణుక్కున్నాడు గుమాస్తా.

ఏమి చేయాలో తెలియక బయటకు వచ్చి అక్కడున్న బంట్రోతుకి యాభై రూపాయలిచ్చి విషయం అడిగాడు.

"మీరు పోస్టాఫీసులో కనుక్కోండి" అన్నాడాయన తాపీగా. పోస్టాఫీసు అక్కడికి మూడు కిలోమీటర్లు. స్కూటరుని పోస్టాఫీసు వైపు పరుగు తీయించాడు. తాలూకా ఆఫీసులో జరిగినట్లే జరిగింది అక్కడ కూడా.

**"త్వరగా ఎక్కండి. ఆలస్యమవుతుంది" అన్నాడు. "ఏమండీ! పిల్లలకు ఆకలి అవుతోంది. అక్కడికి రేపు వెళదాం" అంది సుజాత. సుబ్బారావుకి కోపం తారస్థాయికి చేరుకుంది. "ఇంటి ముందుకు వచ్చిన లక్ష్మిని వెళ్లగొట్టుకుంటామా?" రోడ్డని కూడా మరచి పెద్దగా అరిచాడు.**

సుబ్బారావుకి ఏడుపొచ్చినంత పనయింది. ఆయన బాధ చూసి పోస్టాఫీసుకు వచ్చిన ఒకతను విభవ జూనియర్ కాలేజిలో దరఖాస్తులు తీసుకుంటున్నట్లు చెప్పాడు. అప్పటికి ఒంటిగంటయింది. సుమన్ నాపీ ఖరాబు చేసినట్లున్నాడు ఏడుస్తున్నాడు. మాధురి కూడా ఎండకు వడలిపోయి నిద్రలో తూలుతోంది.

"త్వరగా ఎక్కండి. ఆలస్యమవుతుంది" అన్నాడు.

"ఏమండీ! పిల్లలకు ఆకలి అవుతోంది. అక్కడికి రేపు వెళదాం" అంది సుజాత.

సుబ్బారావుకి కోపం తారస్థాయికి చేరుకుంది. "ఇంటి ముందుకు వచ్చిన లక్ష్మిని వెళ్లగొట్టుకుంటామా?" రోడ్డని కూడా మరచి పెద్దగా అరిచాడు.

వాదించే ఓపిక లేక స్కూటరు ఎక్కి కూర్చుంది సుజాత.

కాలేజీకి వెళ్లేసరికి పావు తక్కువ రెండయింది.

"ఇక్కడ ఆధార్ కార్డు దరఖాస్తు తీసుకుంటున్నారట, ఎక్కడ?" గేటు దగ్గర వాకబు చేశాడు.

"వెళ్లిపోయారండీ వాళ్లు. ఒంటిగంట వరకే ఉంటారు" అన్నాడు గేట్‌మాన్.

తల తిరిగినంత పనయింది సుబ్బారావుకి.

"నేను చెప్పాను కదా, రేపు వెళదామని!" నసిగింది సుజాత.

"ఇదంతా నీ వల్లే జరిగింది" అన్నాడు విసురుగా అత్తమీద కోపం దుత్తమీద చూపించినట్లు.

"నేనేమి చేశాను?" అదే స్థాయిలో అందామె.

రోడ్డుమీద అరుచుకోవడం బాగుండదని విసుగ్గా వెనుదిరిగాడు.

ఇంటికి చేరేసరికి మూడయింది. అలసిపోయిన పిల్లలు సరిగా అన్నం తినకుండానే నిద్రపోయారు. దిగులుగా కూర్చున్న భర్తను చూసేసరికి సుజాత మనసు ద్రవించిపోయింది.

"మునిసిపాలిటీవాళ్లు నంబరడిగినప్పుడు దరఖాస్తు పెట్టుకుంటే ఈపాటికి కార్డులు వచ్చేసి ఉండేవి" అంది.

"నువ్వు ఇప్పుడు ఎత్తిపొడవవలసిన అవసరం లేదు" అన్నాడు కళ్లు మూసుకుంటూ. రాత్రంతా కలతనిద్ర పోయాడు.

మరుసటిరోజు పది గంటలకల్లా కాలేజీ చేరుకున్నారు. సుజాత ఫొటో తీయించుకుంది. మాధురిదీ కూడా అయింది. సుమన్‌కి అవసరం లేదన్నారు. సుబ్బారావు ఫొటోకి కూర్చున్నాడో లేదో కరంటు పోయింది. ఏడుపు ఒక్కటే తక్కువ అతనికి. కరంటు వచ్చేసరికి పన్నెండు దాటింది. ఎలాగోలాగు పని పూర్తి అయింది.

"కార్డులు ఎప్పుడు వస్తాయి?" ఆత్రంగా అడిగాడు.

"రెండు నెలల తరువాత పోస్టులో మీ ఇంటికి వస్తాయి" అన్నాడాయన.

"రెండు నెలల తరువాతా?" నోరెళ్లబెట్టాడు.

విచిత్రంగా చూశారు వాళ్లు,

అతన్ని. రోజు ఆఫీసునుండి రాగానే ముందు అడిగే మాట "పోస్టు వచ్చిందా" అని. ఆనాడు మునిసిపాలిటీ నుండి ఫోను వచ్చినప్పుడు, అదంత ముఖ్యం కాదని ఆ ఫోనును లెక్క చేయలేదు. ఇప్పుడు అతని అవసరం కాబట్టి హడావుడి పడుతున్నాడు. మనసులో ఆ మాట గుచ్చుకుంటున్నదతనికి. వారం తరువాత కావేరి షాపు నుండి మళ్లీ ఫోను.

"సార్! మీరు వారం రోజులలో మీ కూపను, ఆధార్ కార్డుతో షాపుకు రావాలి. లేకుంటే మీ బహుమతి రద్దు చేయబడుతుంది" అన్నారు.

మూడు నెలల తరువాత ఆధార్ కార్డులు పోస్టులో వచ్చాయి. వెంటనే మునిసిపాలిటీలో నంబరు ఇచ్చాడు. ఆ దారిలోనే ఉన్న కావేరి షాపును చూసి బాధగా తల తిప్పుకున్నాడు, సుబ్బారావు. ■

# ఈ వారం కవిత్వం

## బొమ్మ-బొరుసు

ఆటపాటలతో
హాయిగా గడపాల్సిన బాల్యం
ఇటుక బట్టీల్లో, ఫ్యాక్టరీల గొట్టాల్లో
మసిబారిపోతోంది
బాధ్యతలు మోస్తూ బతుకు చక్రాల
మధ్య
నలిగిపోతోంది
హోటళ్లలో ఎంగిలి పళ్లెమవుతోంది
టీ కొట్లలో పగిలిన గ్లాసులవుతోంది
పలకా-బలపం పట్టాల్సిన బాల్యం
మెకానిక్ షెడ్లలో సుత్తి స్పానర్లతో
కుస్తీ పడుతోంది
ఎండకు ఎండుతూ... వానకు తడుస్తూ
లేతమొగ్గలు రాలిపోతున్నాయి
అమ్మ లాలనలో నాన్న పాలనలో
అందమైన లోకంలో విహరించాల్సిన బాలలు
బండెడు పుస్తకాల బరువుతో
వంగిపోతూ కుంగిపోతూ
ఇంగ్లీషు చిలుక పలుకులు వల్లిస్తూ
కాన్వెంట్ ఇరుకు గదుల్లో



రెక్కలు తెగిన సీతాకోక
చిలుకలవుతున్నారు
రేపటి పౌరులు భారత
భాగ్యవిధాతలు
అనురాగం ఆప్యాయతలకు
దూరంగా
కన్నవాళ్ల కన్న కలలను
తీర్చేందుకు
గమ్యంవైపు పరుగెడుతున్నారు
బంగారు బాల్యాన్ని
జారవిడుచుకుంటున్నారు.

– తోట రామమోహన్

## అందాల ఆమని

వసంతమే వచ్చింది వనాల ముంగిట
నిలిచింది
మత్తు మత్తు పరిమళాలు కురిసింది
కొత్త కొత్త అందాలను పరచింది

పూలు రువ్వెను చిలిపి నవ్వులు
గాలి నిమిరెను పూలరేకులు

కువకువలాడే గువ్వల జంటలు
హాయిగ సాగే కోయిల పాటలు

భ్రమరాల నయనాల కమలాలు పూచె
గులాబీల గుండెల్లో తుమ్మెదలు తోచె

మావికొమ్మ ఊయల
కోయిలమ్మ ఊగెలే
వాణి వీణ మీటినట్లు
తేనెపాట పాడెలే

ఆ నల్లనయ్యే తుమ్మెదనగా
ఈ తెల్లతామర రాధయనగా

వనమంతా వలపుతోట
జగమంతా ప్రణయబాట

– చిరమన వెంకట రమణయ్య

## అంతర్ భావలోకాలు

ఆకాశంలో మబ్బుల గుంపులన్నీ
మరో లోకంలోకి ఎదలోని
జీవనరాగాలు
మదిసొదలు విన్పించేందుకు వలస

తేనెపలుకుల
తీయని రుచే కాదు
బతుకు సత్యాల నిదర్శనం
అవ్వాలి.

అపుడపుడూ చీకటి ఊడలను
ఖండించే వెన్నెల ఖడ్గాలుగా
జనించాలి సృజించాలి

ఆకు ఆకులో పచ్చపచ్చని
పచ్చల ఆశారాగమై
ఆత్మీయతల మానవీయత
పెల్లుబుకాలి

ఈ దారిగుండా వేకువవేళ
నడుస్తున్నప్పుడు
రాత్రి కురిసిన నిహారికల
మంచుబొట్లన్నీ
మంచిముత్యాలై విరిసి
భానుని కిరణాల జాలుకు
మాయమైనవి వింతగా
ఇంతలోనే అంతగా

నీతుల చిట్టా ఎంతగా వల్లించినా
ఆచరణాదర్శమే
జాతి జనుల గుండెలో
కలకాలం ఆరని వెలుగుల జ్యోతై
నిలుస్తుంది.

– అంజనాశ్రీ

## రచనలకు ఆహ్వానం

రచయితలనుండి కథలు, కవితలు, సమకాలీన వ్యాసాలు స్వాగతిస్తున్నాం. రచనలతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని రచనలు తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి. ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న రచనలు పంపించకండి. **రచనలు పంపించాల్సిన చిరునామా:**

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్-80**

సింగిల్ పేజీ కథ

# మరక

– ఆవులపాటి రెడ్డెప్ప

**శివరాత్రి** పర్వదిన సందర్భంగా శివ, పార్వతుల ఉత్సవ విగ్రహాలు ఊళ్లోకి ఊరేగింపుగా వస్తున్నాయి.

అధునాతనంగా లారీపై పుష్పపల్లకి కట్టి వివిధ పుష్పాలంకారాలతో రంగు రంగుల విద్యుత్ దీపాలతో శోభాయమానంగా తీర్చిదిద్దారు.

లారీ క్యాబిన్ తీసివేసి ముందువరకు పల్లకి సాచి కట్టడంతో లారి ఏమాత్రం కనబడక, పక్కలనుండి కూడా పూలహారాలు దిగవేయడంతో లారిటైర్లు కనబడక పల్లకి నడచి, వచ్చినట్లుంది.

పల్లకి పై భాగంలో శివలింగం అమర్చి దాని చుట్టూ రన్నింగ్ బల్బులు చుట్టి శివలింగం శిరస్సుపై గంగాదేవి నుంచి, ఆమె నోటినుండి సదా నీరు ప్రవహిస్తున్నట్లు తెల్లటి రన్నింగ్ బల్బులతో అద్భుతంగా అలంకరించారు. అలంకరణ ఖర్చు దాదాపు ఐదారు లక్షలు దాటి వుంటుంది.

పల్లకి ముందు వివిధ వాయిద్య బృందాలతో జనం కిక్కిరిసిపోయి రోడ్లు చాలటం లేదు.

పల్లకి చూడాలన్న ఉత్సాహంతో నేను ఇంటినుండి రోడ్డుపైకి చేరి కూడలిలో నిలిచి వున్న పల్లకివైపు నడిచాను. నేను సగం దూరం వచ్చేసరికి ఒకడు బాగా తాగేసి తూలుతూ నా వైపు యముడిలా వస్తున్నాడు.

వాణ్ణి చూడగానే ఉలిక్కిపడ్డాను. వాడెప్పుడూ మా సర్కిల్‌లోనే వుంటాడు. వాడికి ముప్పై దాటి ఉంటుంది.

వాడు రోడ్డు మధ్యలో నిలబడి వచ్చీ, పోయే వాహనాలకు చేత్తో ఓ కర్ర పట్టుకొని, సిగ్నల్స్ చూపిస్తూ ట్రాఫిక్ కంట్రోల్ చేస్తున్నట్లు అరుస్తూ, అనవసరమైన బోడిపెత్తనం చేస్తుంటాడు.

వాడి కంటికి ఎవరైనా కాస్త క్లాసుగా కనిపించినా వాడు మస్సైపోతాడు. ఎదురుగా తూలుతూ నిలబడి చేతులు ముందుకు చాస్తూ "పది రూపాలీ స్వామీ!" అంటూ హైరానా పట్టించేస్తాడు. చుట్టుపక్కల వారంతా మనల్నే తమాషాగా చూస్తారు. మనమే సిగ్గుపడి, వాడికి ఖచ్చితంగా డబ్బులిచ్చి, ఆ రొచ్చు నుండి బైటపడాలి.

నా టైమ్ దగ్గర పడింది. వాడు నాకెదురుగా వస్తున్నాడు. ఇంతలో పక్క సందు నుండి ఒకామె సడన్‌గా నా ముందు రోడ్డుపైకొచ్చింది. ఆమె వయస్సు యాభై వుంటుంది. ఆమె నా ఏరియా ఆమె. ఆమెకు వాడు తెలుసు. వాడికి ఆమె తెలుసు. వాడు ఆమెకు అడ్డు పడ్డాడు.

"అక్కా! అమ్మా! నాకు పది రూపాయలు కావాలి. తల్లీ! మా యమ్మా!" అంటూ ఆమె ముందు అడ్డం నిలబడేశాడు.

ఆమె "లేదురా! నా దగ్గర" అంది.

వాడు వున్నపళంగా ఆమె కాళ్లు పట్టుకొనేశాడు.

ఆమెకు దిక్కుతోచని పరిస్థితైంది. అప్పటికే జనం వారిద్దరివైపు ఫన్నీగా చూస్తున్నారు. ఆమెకు పరిస్థితి అర్థమైంది. ఇక తప్పదని "ఇస్తాను.. లేరా" అంటూ, తన పర్సునుండి పది రూపాయల నోటు తీసి ఇచ్చింది.

ఆమె తరువాత వంతు నాదే. వాడు నన్ను నిలదీసి డబ్బు గుంజందే వదలడు. నేను మెల్లగా ఒక పక్కగా వాడి కంట పడకుండా తప్పుకోవాలి. గుండెలనిండా ఊపిరి తీసుకున్నాను. మొహం చాటు చేసుకుంటూ ఒక పక్క నుంచి తప్పుకొనే ప్రయత్నంలో వాడి కంట పడనే పడ్డాను. అయినా వాడెందుకో నన్ను పట్టించుకోలేదు. నేను ఊపిరి పీల్చుకున్నాను.

పుష్పపల్లకి కూడలి చేరింది. దేవుణ్ణి చూడడానికైనా వీలు పడనంత జనం కిక్కిరిసి వున్నారు. నేను వారి మధ్య దూరి కనిపించీ.. కనిపించని దేవుణ్ణి మొక్కుకుంటున్నా. ప్రజలు పూజాసామగ్రి పూజారి చేతికిచ్చి శివ పార్వతులకు అర్చన చేయించుకుంటున్నారు. పల్లకికి ఒక పక్కగా హుండీ బిగించి పెట్టారు. భక్తులందరూ తమకు తోచిన డబ్బు అందులో వేసి, హుండీని కూడా కళ్లకద్దుకుంటున్నారు. నాకు కూడా దేవుని హుండీలో డబ్బు వేయాలనిపించింది. జేబులోకి చెయ్యి దూర్చాను. అంతలోనే మనస్సు మారింది. శివాలయానికి ఆదాయం కోట్లల్లో వుంది. వేలకు వేల ఎకరాల భూములు, భక్తులు సమర్పించిన బంగారు ఆభరణాలు, అద్దెషాపుల ఆదాయం మూలుగుతున్నాయి. నేను కొంత డబ్బు వేయనంత మాత్రాన వచ్చిన నష్టమేమీ లేదు. చేతివేళ్లకు నా జేబులోని నోట్లు మెత్తగా తగులుతున్నాయి. ఆ నోట్లు బయటకు లాగడానికి మనస్సు అంగీకరించలేదు. చెయ్యి వెనక్కి తీసుకున్నాను.




ఇంతలో జనం మధ్య నుండి నన్ను తోసుకుంటూ ఒకడు పల్లకి ముందుకు దూరాడు. కంపు గొడుతున్న వాడు, వాడి వేషం చూసి అసహ్యం వేసింది. మాసి మగ్గిపోయి మురికి పట్టిన బట్టలతో వున్నాడు.

నేను కంగారుగా నా బట్టల వైపు తిరిగి తిరిగి చూసుకున్నాను. నా తెల్లటి ఖద్దరు షర్టుకు నల్లటి మరకైంది. వానిపై నాకు పట్టరాని కోపం ముంచుకొచ్చింది.

వాడు నా కోపాగ్నికి అందనంత దూరంలో పల్లకి ముందు లైట్ల కాంతిలో మెరిసిపోతున్నాడు. వాడు ఇందాక ఎదురుపడినవాడే.

వాడు దేవుని ముందుకెళ్లి రోడ్డుపై సాష్టాంగపడి నమస్కరిస్తున్నాడు. ఆ తరువాత వాడు ఇందాకటి ఒకామె కాళ్లపై పడి ప్రాధేయపడి అడుక్కున్న పది రూపాయలు నేరుగా వెళ్లి హుండీలో వేసి హుండీని కళ్లకద్దుకొని, పూజారి ముందుకెళ్లి తీర్థ ప్రసాదాలు తీసుకొని, కళ్లకద్దుకొని మరుక్షణంలో మాయమైపోయాడు.

నేను షాకయ్యాను. వాడు మాసే అయినా వాడి దాతృత్వం ముందు నేను తల వంచవలసి వచ్చింది.

ఒక పూట గడిస్తే, రెండవ పూటకు వెతుక్కునేవాడు. ఒకరి కాళ్లపై పడి సంపాదించిన పది రూపాయలు హుండీలో వేసి వాని భక్తిని చాటుకున్నాడు.

నేను జేబునిండా డబ్బున్నా లేని ఎకనామిక్స్ తెలివంతా దేవునిపై ప్రయోగించి పిసినారై డబ్బు దాచుకున్నాను.

వాడు దేవుణ్ణి చూడాలన్న దృఢ సంకల్పంతో వచ్చాడు, చూసాడు, దర్శనం చేసుకున్నాడు.

నేను పుష్పపల్లకి చూసి ఎంజాయ్ చేయాలని వచ్చాను. భక్తిగా దేవునిపై మనసుంచక దేవుణ్ణి దర్శించుకోలేకపోయాను. మురికి పట్టింది వాడికి కాదు, నాకు. మరక నేను వేసుకున్న తెల్లటి ఖద్దరు బట్టలపై లేదు... నా మనస్సుకుంది.

నేను ఆలోచిస్తూ తిరిగి చూసేసరికి దేవుని పల్లకిలో చిరునవ్వుల సర్వాంతర్యామి నాకు చాలా దూరంలో వున్నాడు. ■

## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ

డా॥ దంతూరి పండరినాథ్

3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3

సెల్స్: 9885446501/ 9885449458




# దేవతా వేధ అంటే ఏమిటి?

పిఎస్ - కాకినాడ

**ప్రశ్న: దేవతా వేధ అంటే ఏమిటో వివరించగలరు.**

గృహానికి దూరంగా అంటే ఒక గృహ ద్వారానికి లేదా ప్రధాన ద్వారానికి ఎదురుగా ఏ దేవతా స్థానం ఉన్నా 'దేవతా వేధ' కలుగును. వినాశశ్చ దేవసిద్ధే అని శాస్త్ర వచనం. ఈ 'దేవతా వేధ' అనే వాస్తు దోషంవల్ల ఆ ఇంట్లో నివాసం ఉండేవారికి, ఆ గృహ యజమానికి ధన నాశనం, కుటుంబ నాశనం కలుగుతుందని సూచించు చున్నది. ఒక గృహ ద్వారానికి ఎదురుగా (మధ్యలో వీధి ఉన్నప్పటికీ) గర్భగుడిలోని మూలవిరాట్లు దృష్టి పడుతున్నా పైన పేర్కొన్న దోషం తీవ్రతరమవుతుంది. చెడు ఫలితాల తీవ్రత కూడా చాలా హెచ్చుగా ఉంటుంది. గృహానికీ, గుడికీ మధ్యలో వీధి ఉంటే చెడు ఫలితాల తీవ్రత కొంత తగ్గుతుంది. కానీ చెడు ఫలితాలుంటాయన టంలో అతిశయోక్తి లేదు. గృహ ద్వారానికి ఎదురుగా దేవతాస్థానమున్నప్పుడు ఆ స్థానాన్ని తప్పించి గృహ ద్వారాన్ని పునః ప్రతిష్టించు కోవటంవలన ఈ దోషం వలన కలిగే చెడు ఫలితాలను చాలావరకు నిరోధించుకోవచ్చు. కానీ గర్భగుడిలోని మూలవిరాట్టు విగ్రహ దృష్టి పడుతుంటే మాత్రం అలాంటి గృహాన్ని విసర్జించటం అన్ని విధాలా మంచిది. వేరే విధాలైన మార్పులతోగానీ, ప్రత్యామ్నాయ పద్ధతులతోగానీ ఇలాంటి దోషం ప్రతిఘటించబడదు. సమయాన్ని, ధనాన్ని అనవసరంగా వెచ్చించి నష్టపోవటంకంటే ముందే జాగ్రత్త పడటం ఉత్తమం.

### కల్పవేధ

గృహానికి దగ్గరలో తాటిచెట్లున్నట్లయితే 'కల్పవేధ' దోషం ప్రాప్తిస్తుంది. గృహానికి దగ్గరగా అంటే గృహానికి చుట్టుపక్కల వంద గజాలలోపు తాటిచెట్లు వుంటే ఈ దోషం ప్రాప్తిస్తుంది. ఈ దోషం వలన బాధలు కలుగుతాయి. తాటిచెట్లు ఎత్తుగా వుంటాయి. కాబట్టి పిడుగుల నాకర్షించే అవకాశం ఉంది. ఇది ఆమోదయోగ్యమే! అంతే కాకుండా 'కల్పవేధ' దోషంవల్ల ఇంట్లో నివసించేవాళ్లు భూత, ప్రేత, పిశాచ బాధలను కూడా పొందుతారని ఒక వాస్తు గ్రంథంలో పేర్కొన్నారు. వాటిమీద నమ్మకాల సంగతి ఎలా వున్నా అర్థం చేసుకోవలసిన తీరులో అర్థం చేసుకోవచ్చు. భూతం అనగా మనకు తెలిసిన పంచభూతాలకు సంబంధించి కానీ మనకు తెలియని మరేదయినా భూతంవల్ల కానీ బాధలు పొంద వలసి రావచ్చు. వీటికి రెండు కొమ్ములు, నాలుగు కోర దంతాలు, పెద్ద కళ్లు వుంటాయన్నట్టుగా ఊహించుకోకూడదు. ప్రేతం అంటే కళేబరం అని అర్థముంది. కళేబరానికి సంబంధించిన విధంగా బాధలు పొందవలసి రావచ్చు. పిశాచం అంటే పట్టి పీడించేదన్న అర్థం సరిపోతుంది. ఏ విధమైన పీడ అయినాగానీ అది బాధిస్తుంది. సప్త వ్యసనాలు కూడా మనిషిని పీడించేవే. ఈ వేధ దోషమున్న చోట పైన పేర్కొనబడిన భూత, ప్రేత, పిశాచ బాధలు కలిగే అవకాశాలుంటాయని అన్నది సత్యదూరం కాకపోవచ్చు. గృహానికి 'కల్పవేధ' వుండకూడదనుకుంటే తాటిచెట్లు పరిసరాలలో లేని క్షేత్రాన్ని ఎన్నుకోవాలి. ఒకవేళ ఇంటి పరిసరాలలో వంద గజాలలోపు తాటిచెట్లు ఏవయినా వుంటే వెంటనే ఆ తాటిచెట్లను తీసివేయకూడదు. ఇంటికి తాటిచెట్టుకి మధ్య దూరాన్ని బట్టి మధ్యలో వున్న ఇళ్లనిబట్టి, బావులను మొదలయిన వనరులనుబట్టి ఈ రెండింటి (ఇల్లు, తాటి చెట్టు) ఎత్తుపల్లాలను బట్టి ఇంటి పరిసరాలలో వున్న ఇతర వాస్తు ప్రమాణాలనుబట్టి ఫలాఫలాలుంటాయి. ఒకవేళ ఎవరైనా ఒక ఇంట్లో పైన సూచించిన బాధలకి లోనై వున్నప్పుడు పరిసరాలలో 'కల్పవేధ' దోషం కూడా కనిపిస్తే అప్పుడు ఆ దోషాన్ని నిర్మూలించే ప్రయత్నం చేయవచ్చు. కారణం తెలియని అనేక మానసిక రుగ్మతలకు 'కల్పవేధ' దోషం కారణమయ్యే అవకాశం ఉంటుంది. ఎక్కడికో పోయి, ఏవేవో ప్రయత్నాలు చేసే బదులు మానసిక రుగ్మతులున్నవారి ఇంటికి 'కల్పవేధ' దోషం వున్నదేమోనని ఒక్కసారి పరిశీలించుకుంటే మంచిది. ఈ దోషం వుండి ఆ ఇంట్లో ఉన్నవారు పీడింపబడుతున్నట్లయితే మాత్రం ఈ దోష నివారణ చర్యలు తీసుకుంటే క్రమంగా దోషం తొలగిపోయి స్వస్థత చేకూరి ఆనందమయ జీవితాన్ని సాగించగలరు.

మరొక ముఖ్య విషయమేమిటంటే ఏదైనా ఒక చెట్టును/వృక్షాన్ని కానీ తీసేయాల్సి వస్తే ఒకే రోజులో దానిని పూర్తిగా తీసివేయాలి. కాండ శేషం కనిపించకూడదు. అందినంత వరకు భూమిలోపల అడుగువరకు తవ్వి వేర్లతో సహా కాండాన్ని తీసేయాలి. ఆ గొయ్యిని మామూలు మట్టితో యథావిధిని పూడ్చేయాలి. చెట్టు అవశేషాలు గృహంలో/గృహావరణలో వుండకూడదు. ఎత్తుగా పెరిగే అశోక వృక్షాలు మొదలయిన వాటిని కారణాంతరాల వల్ల ఎత్తు తగ్గించటానికి కానీ కొమ్మలను చెక్కి తీసివేయటం దోషం కాదు.

## వాయువ్యంలో లెట్రిన్ ఉండవచ్చా?

- ఎ.రెడ్డి - ప.గో.జిల్లా

**ప్రశ్న: మా ఇంటి నైరుతి భాగంలో ఖాళీగా ఉన్నది. అక్కడ బాత్‌రూమ్, లెట్రిన్ నిర్మించాలనుకున్నాం. అయితే వాటి నీళ్లు ఎటువైపు పోవాలన్నదే సమస్య. వాయువ్య మూలన లెట్రిన్ నిర్మించాలంటే మీరు నిర్మించకూడదని రాసారు. మూలలో ఎంత ఖాళీ స్థలం విడిచి నిర్మించవచ్చో తెలుపగలరు.**

**జవాబు:** నైరుతి మూలలో లెట్రిన్, బాత్‌రూమ్స్ నిర్మిస్తే నీళ్లు అటువైపు నుండి బయటకు పంపించటం కుదరదు. మీ గృహానికి ఉత్తరంవైపు మాత్రమే వీధి ఉన్నది. గృహానికి ఉత్తరాన 29 అడుగుల ఖాళీ స్థలం వున్నది. అందుకని ప్రధాన గృహానికి నాలుగయిదు అడుగుల ఖాళీ స్థలాన్ని వదలి, పడమర సరిహద్దును చేర్చి లేదా చేర్చకుండా లెట్రిన్, బాత్‌రూమ్స్ కట్టుకోవచ్చు. నీళ్ల ఉత్తరం దిక్కునుండి (గృహ ద్వారానికి ఎదురుగా కాకుండా) బయటకు వెళ్లేలా పైప్ లైన్ వేసుకోవచ్చు. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ----------------------------------------

పుట్టినతేదీ:------------------ ఊరు: -------------

జన్మనక్షత్రం:---------తల్లిపేరు:---------------------

చిరునామా: ------------------------------------

------------------ ఫోన్: ---------------------

